జూన్

1975

# భారతి

వ్యవస్థాపకులు

దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులు

వెల: రూపాయిన్నర

# భారతి

మాసపత్రిక



శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు

(1938-1972)



జూన్ 1975

సంపుటము 52 : సంచిక 6 :

విడిపత్రిక వెల రూపాయిన్నర

# విషయానుక్రమణిక

## జూన్ 1975

# వసంతం ఏ వీథిని?

శ్రీ ఆకొండి వెంకటరత్నం

రాత్రంతా పులినంటి చలితో నేస్తం కట్టి
మంచు కోరలు పీల్చే రక్తం గడ్డ కట్టి —
గంట్లు పడిన శిల్పంలా
మునుపటి నీరెండల వెచ్చదనం కోసం
కలల దారులు పరచిన నాకు
నీ తోడు లేక ఎదురైనవి
వేడి వేడి సూదులు !

ముఖంమీద గుప్పుమంటున్న యెండ;
ముడుచుకున్న ముదుసలి వంటి చెట్టునీడ
తో ఎండిన ఆకుల నడుమ
నా దేహం మీద పిడక పడిచే నిప్పులు !

చల్లటి వసంతాన్ని పిలిచే పిల్ల గాలులకోసం
కలలదారులు పరచిన నాకు
నీ తోడు లేక ఎదురైనవి
వేడి వేడి సూదులు !

గుండె పగిలింది ఉరుముతో
కన్ను చెదిరింది మెరుపులో
తనువు తడిసింది
జల జల జల కరిగిన ఆకాశంతో !
నేల నిండా ఉప్పొంగిన నదులు !
రెక్కల కింద ఒదిగిపోడానికి
తల్లిని పిలిచే పిచుక పిల్లలా
గుణ గుణ పాటలు పాడుతున్న నాకు
నీ తోడులేక ఎదురైనవి
చెమ్మగిలిన గుండెలోకి దూసుకుపోతూ
కన్నీటి సూదులు !

ఇక

వెచ్చదనం ఎక్కడుంది?
వసంతం ఏ వీథిని ?
ఏ ఆశల దారుల్లో దాక్కుని ?

# శివస్తవము: నన్నెచోడని కుమారసంభవము

డా॥ నేలటూరు వేంకట రమణయ్య

ఈ శివస్తవమున అయిదు వృత్తములు — మూడు లయగ్రాహులు, రెండు లయ హారిణులు — గలవు. ఇందు మొదటి దానియందు లయతాండవమును రెంటిలో మూటిలో నాట్య వాద్యములయందు తన్మయత్వమును, నాల్గవ దానిలో పరమేశ్వరుని సౌమ్యాకారమును, కడపటి దానిలో నతని సుప్రసన్నతయు వరముల దానములును వర్ణింపబడినవి.

ఇందు దక్షుని కథ భిన్నముగా నున్నది. వీరభద్రుని ప్రస్తావము లేదు. దక్షుని తలను కొట్టనులేదు. మేక తలను పెట్టనులేదు. సతీదేవి అగ్నిలో దహనమై పోయినప్పుడు దక్షునిమీద కోపించినవారు గణనాయకులు. వీరు వినాయకు లగుదురో కారో చెప్పుటకు వీలుకాదు గాని పోయి దక్షుని వెదకి పట్టి స్మరణ పోవునట్లు కొట్టి కావడించి తెచ్చినవారు. దేహ స్మారకములేని దక్షుని శరీరము శివుని తాకుడుచే యథాపూర్వము అక్షత శరీరమై లేచెను. బాధ లేకపోయెను. అప్పుడే దక్షుని భార్య శివుని పతిభిక్ష వేడెను. శివుడు కరుణింపగా బ్రహ్మాదులు అదిమూచి వేడగా, శివునాజ్ఞచే దక్షుని కట్లువిప్పగా నాతడు ఈ యైదు వృత్తములను ఆడుచు పాడెను.

లయగ్రాహి :

ఫాలతల విస్ఫురిత లోలతర భాసురవి
శాల భయదాసుర కరాళ నయనాగ్ని
జ్వాలలొకొ పింగళ జటాళియొకొ నా బెరసి
తూలి దివిభూషణచయాలులిత దీర్ఘ
వ్యాళనికరంబొకొ కరాళియొకొ నాఁ దనరి
కాల వరనృత్య పరలోలుఁడగు శ్రీకం
కాలధరు నుజ్జ్వల కపాలధరు సన్నిశిత
శూలధరు నీశ్వరు దయాళు నుతియింతున్.

ఫాలతల = నుదుటియందలి, విస్ఫురిత = ప్రజ్వలితమై, లోలతర = చక్కగ సంచలించునదియు, భాసుర = ప్రకాశవంతమైన, విశాల = వెడదయగు, భయదాసురకరాళ = భీతిగొలుపు నసురసంబంధమైన శివునియొక్క, నయనాగ్ని = కంటి నిప్పుయొక్క, జ్వాలలొకొ = మంటలేమొ! (కాబోలు), పింగళజటాళి = గోరోజనపు రంగుగల జడల సమూహము, ఒకొ = ఏమొ! నా = అనునటు, బెరసి = కలియబడి, దివి = ఆకాశమునందు, తూలి = ఎగయుచు.

భూషణ చయాలులిత, భూషణచయ = ఆభరణములసమూహములో, లులిత = చలించెడు, వ్యాళనికరంబొకొ = పాముల గుంపొ, లేదా, కరాళి = అగ్నిజిహ్వలొ, నా = అనగా, తనరి = ఒప్పి, క్రాల = ప్రకాశింపగా.

వర = ప్రియకరమైన, నృత్యపర = శ్రేష్ఠ నర్తనము నందు, లోలుఁడగు = ఆసక్తుఁడగు, శ్రీ కంకాలధరున్ = శోభాయుతమైన బొమికలగూటిని ధరించినవాడును, ఉజ్జ్వలకపాలధరు, ఉజ్జ్వల = జ్వలించునట్టి, కపాలధరు = పుర్రె దాల్చును, సునిశిత = మిక్కిలివాడియైన, శూలధరున్ = శూలమను నాయుధమును చేబట్టువానిని, దయాళున్ = కనికరముగలవాడయిన, ఈశ్వరున్ = శివుని, నుతియింతున్ = కీర్తింతును.

లయగ్రాహి :

ఉర్వర చలింపఁ గులపర్వత చయంబడలఁ
బర్వి భువి నంబునిధు లూర్వశిఖియుం దన్

బూర్వసురనాగసుర పూర్వదిగధీశ యమ
వార్విభు ధనేశ్వరుల గర్వములడఁగన్
సర్వగణముఖులును సర్వగణభూతములు
నార్వ నహిభూషణము లూర్వదిశలన్ గం
ధర్వ తతిపాడఁగ నపూర్వ నటనాది గురు
సర్వగతు సర్వమయు శర్వు నుతియింతున్

ఉర్వర చలింపన్ = భూమికదలియాడగా, కులపర్వత చయంబు, కులపర్వత = భూమిమీద ముఖ్యపర్వతములు (మహేంద్ర మలయాదులు ఇవియేడు), చయంబు = సమూహము, అడరన్ = కలతనందగా, అంబునిధులు = సముద్రములోని, ఔర్వశిఖి = బడబానలము, భువి = భూమియందు, పర్వి = ప్రసరించి, వ్యాపించి, అడన్ = వర్తింపగా, పూర్వసుర = అసురులయొక్కయు, నాగ = నాగులయొక్కయు, సుర = దేవతలయొక్కయు పూర్వదిగధీశ = తూరుపుదిక్కున కధిపతియైన ఇంద్రునియొక్కయు, యమ = యమధర్మరాజుయొక్కయు, వార్విభు = నీళ్ళకు అధిపతియైన వరుణుని యొక్కయు, ధనేశ్వరుల = ధనమున కధిపతియైన కుబేరుని యొక్కయు, గర్వములు = కావరములు, అహంకారములు, అడంగన్ = మట్టుపడగా = ఇచ్చట చతుర్దిక్పతులు మాత్రము పేర్కొనబడినారు. = అగ్నివాయు నైరుతి ఈశాన్యులను విదిక్కుల ప్రభువుల ప్రస్తావములేదు. ఈశాన్యాధిపతి శివుడే కదాయని యను కొనవలసిన పనిలేదు. అతడు రుద్రులలో నొక్కడు కావచ్చును.

'సర్వగుణముఖ్యులును, సర్వగణభూతములు' అని వ్రాత ప్రతి= 'గణముఖ్యులు' 'గణభూతములు' అనుట యొప్పగును = సర్వగణ ముఖులును = సకలగణాధిపులును, సర్వగణభూతములు = సకల భూతములపిండును, ఆర్వన్ = బొబ్బలుపెట్టగా.

అహిభూషణములు = పాములైన సొమ్ములు, ఓర్వ' అని వ్రాతప్రతి 'ఊర్వన్' = ఊపిరి (గట్టిగా) విడువగా. అని మద రాసు విశ్వవిద్యాలయమువారి పుట 41 - ఓర్వన్ = ఓర్చుకొని యుండగా, గణభూతాదులిడు బొబ్బలకు వెఱచి పారిపోక సహించు కొని యుండగా,

దిశలన్ = దిక్కులందు, గంధర్వతతిపాడగ | (గంధర్వ తతి + పాడగ) గంధర్వుల సమూహము పాడగా (గానముచేయుగా), 'అపూర్వ నటవాదియగు' అని వ్రాత ప్రతి : అపూర్వ నటనాదిగురు మద విశ్వవి. సాధువు అపూర్వ = వింతయైన, నటన = నృత్య మునకు, ఆదిగురు = మూలాచార్యుడైనవాడును, సర్వగతు = ఎల్లయెడల నుండువాడును, సర్వమయు = సర్వము తానేయైన వాడును అగు, శర్వున్ = ఈశ్వరుని, నుతింతును = కీర్తింతును.

లయగ్రాహి :

తాలరుతి గీతి రుతిమేళి తతివాద్యరుతి
సాలరసవంతమయి యోలి నుతియందఁ
గ్రాలగతి మెట్టుచును గేలచరువిచ్చుచును
జాలి యను రాగమున గ్రాలుచు సుఖాబ్ధిన్
దేలుచును మేమఱచి వ్రాలుచును గెత్తుచును
లోలగతి నేత్రభుజ చాలనలతోఁ బే
తాలయమునందు సుఖలీల నెలసంజ నను
కూల గతినాడు శివు శూలి నుతియింతున్

తాలరుతి = తాలముయొక్క ధ్వనియు, గీతిరుతి = పాటపాడు శబ్దమును, మేలితతి = మేలుతరగతి, వాద్యరుతి = వాద్యముల మోతయు, మేళితతి వాద్యరుతియనగా భేరికాహళపంచమహావాద్య ముల మోతయని గ్రహింపవచ్చును. మూడువిధములే పేర్కొనబడుట వలన తౌర్యత్రికమును కవియుద్దేశించినటు తోచుచున్నది ఇందు వర్ణింపబడిన యంశము శివతాండవముగావున తాలమనగా నృత్యమున నడుగువేయుట కనుకూలమగు లయయని తలచుట యుక్తము, వాద్యరుతిసాల =వాద్యరుతి + చాల,సాలరసవంతమయి = మిక్కిలియు రసభరితమయి వినుటకు మిక్కిలి ఇంపయి, ఓలిన్ = వరుసగా, క్రమప్రకారము,ఉలియన్ = మ్రోయగా, గ్రాలగతి =మిక్కిలియు మదేకముతో, మెట్టుచును =అడుగులు వేయుచును, కేల్ = చేతితో, చరలిచ్చుచును = చప్పట్లు చఱచుచును, అనురాగమ = ప్రేమయందు, జాలి = దీటయి, గ్రాలుచు = వర్తించుచు, సుఖాబ్ధిన్ = సుఖమను సముద్రములో, తేలుచును =తేలియాడుచును, మేమఱచి = దేహస్మారకముదప్పి, వ్రాలుచును = పడుచును గెత్తుచును = గెంతులు వేయుచును, లోలగతి 'రోలగతి' అని వ్రాత ప్రతి : తూలియాడుచు, నేత్రభుజచాలనలతో = కన్నులను త్రిప్పుచు భుజములనాడించుచు, పేతాలయమునందు = శ్మశానమున, వల్ల కాటిలో, సుఖలీలన్ = సౌఖ్యముగ, ఎలసంజన్ = ప్రాతస్సాయం

సంధ్యలయందు "సెంజకెంజ" యనగా సెంజెనసంధ్య, సూర్యాస్త మయములలో అరుణభానుని కిరణ ప్రసారమువలన ఆకాశము రక్త సిక్తమైనట్లు అవారును. తత్కారణమున సెంజసంజయని చెప్పదురు. అరుణోదయాస్తమయములు (లేదా సెంజసంజయని యేనియు గ్రహింపనగును. సెంజసంజయనగా సిందుసంజ.)
అనుకూలగతి (ననునోలగతి యని వ్రాతప్రతి) = ఆయాసంధ్యలకు తగిన విధమున, ఆడు = నృత్యముసల్పు, శివు = శివుని, శూల = శూలాయుధుని, నుతియింతున్ = కీర్తింతును.

మొదటి చరణమునందలి 'ప్రోత్తాలగతి' యను వ్రాతప్రతి పాఠమును పరిష్కర్తలు 'తత్తాలగతి' అని సవరించినారు. ఈ సవరణ యనావశ్యమైనది 'ప్రోత్తాలగతి' యను పాఠమే యంగీకారము. చర్చరీ ఇది 'చర్చి' శబ్దముయొక్క బ. వ. (చరి + చరి = చర్చరి) ఈ శబ్దమేనకు యాంధ్రగ్రంధములలో ప్రయోగాంతముగానరాదు. గెత్తుచును 'గెంతచు, ఊగుచు' లఘువ్యాఖ్య పుట 12. ఈ మాటకును ప్రయోగాంతరము లేదు.

లయహారిణి:

కఱగళము ఘనఘనము తెఱగనగ మఱికలును
గఱడియలు ద్రిపుదలును గిఱిడియలు పెల్లు
యుఱుములన పడిఁ జెలఁగఁ గొఱనెలయుఁ దనురుచులు
మెఱుగులన దశదిశల మెఱవఁదలమీదన్
వఱలు సురనది దొలఁకి నెఱిఁజినుకులనుఁగురియఁ
దఱిమికొని తొలుమొగులు తఱియనంగ నృత్యం
బొఱపమరు లలితగతి మెఱయ శివుండఱుఁ డమరు
దుఱుఫలము లొసగునని యెఱింగి నుతియింతున్.

ఈ వృత్తమునందు శివుడు తొలిమొగులుతో నసగా తొలకరి మేఘముతో నుపమింపబడినాడు తొలిమొగులుతో నేలయుపమింపబడె ననగా గ్రీష్మతపముచే గాగియుండునేలకు తొలకరి చినుకుల వలన అత్యంతమాహ్లాదమునగలుగును తరువాత నెంతయధికముగ వర్షము కురిసివెల్లువలె ప్రవహించినను, తత్పూర్వమే తొలకరివానచే తృష్ణ తీరియుండుకారణమున, భూమికి తొలకరివానవలన గలిగినట్లు తరువాతి వానవలన దృప్తి కలుగదు. కావున ప్రమథగణములు పెట్టిన ఎరక బాధలవలన పీడింపబడుచుండిన దక్షుడు గ్రీష్మతపముచే బెట్టువడిన భూమికి తొలకరివాన తాపోపశమనము గల్గించినట్లు తన బాధల బాపునని వేడుకొనుచు శివుని తొలకరితో బోల్చినాడు.

కనగ = చూడగా కఱగళము = ఘనఘనము, తెర,కఱ = నల్లని. గళము = కుత్తుక, ఘనఘనము (ఘనాఘనము) = మేఘము యొక్క, తెర = సమూహము.

మేఘమును కఱగళముతో మాత్రము బోల్చనేల ? ఘనఘనము నల్లనిది శివుడు పాండురాంగుడు. అతని మేనగళమొక్కటియే నల్లనిది. కావున కరగ్గళము ఘనఘనముతో బోల్పబడినది.

ఉఱికలును గఱడియలు ద్రిపుదలును గిఱిడియలు, వీనియర్థమును సునిశ్చయముగ వివరించుటకు వీలులేదు. రామకృష్ణ కవిగారు చెప్పినట్లు, అపూర్వపదంబులకు ప్రయోగంబులు మృగ్యంబులు' — కు. సం. సంపు ౧. అనుబంధము పుట. కాని పైజెప్పిన ఉఱికాదులు నృత్యమున కుపకరణములైన వాద్య విశేషములుగా తోచుచున్నది. ఏలనగా ౧. నివి శివుని నృత్యసమయములందుపయోగింపబడినవి. 'పెల్లెయుఱుములని పడిచెలగ' అని యుండుట వలన నవి మ్రోయు చుండెనని తెలియుచున్నది. కావున వాని స్వరూపమెట్టిదైనను నవి వాద్యములే యనుట తెల్లము.

పెల్లె = అతిశయముగ, ఉఱుములన = మేఘగర్జన యనునట్లు, పడిన్ = వేగముగా, చెలగన్ = శబ్దించుచుండగా, కొఱనెలయు = అర్ధచంద్రుడును, తనరుచులు = తన కిరణకాంతులు, మెఱుగులన = మెఱుపులనునట్లు, దశదిశలన్ = పదిదిక్కులను, (అష్ట దిక్కులను నూర్ధ్వాధస్సులను) మెఱపన్ = మెఱయగా 'మెఱవన్' అనురూప మసాధారణమైనది.) మెఱయన్ అనురూపమె సర్వత్రవాడుక యందున్నది. చంద్ర కిరణముల కాంతి నాట్యము సల్పు మహేశ్వరుని యంగ చలనమువలన విచ్ఛిన్నముగ బ్రసరింపక యనుక్షణమును మఱుగుపడుచు నరల ప్రకాశించుచుండినది. తత్కారణమున చంద్రకిరణకాంతికి విద్యుల్లతతో సామ్యమేర్పడినది.

తలమీదన్ = పరమేశ్వరుని శిరస్సుపై, వఱలు = ప్రవహించు, సురనది = ఆకాశగంగ, తొలకి = తొనకి చెదరి, నెఱిజినుకులను = ఏటవాలుగబడు వానబొట్లను, కురియన్ = వర్షింపగా, (శివుడు నృత్యము సల్పుచు నడుగు వేయునప్పుడు అతని

శిరము మీది గంగా స్రవంతి క్రిందుమీదగుట వలన నీరు చెదిరి వర్ష బిందువుల బోలి క్రిందరాలినవి )

'తఱిమికొని' తఱుముకొను తొలిమొగులు తఱి' యని యుండుట యుక్తము తఱుముకొను = ఒండొంటిని వెనువెంట నంటి వేగముగ నడుచు, ఇచట తఱుముకొను తొలిమొగులు' అనుట వలన శివుని నాట్యభంగులు అనుక్షణమును మార్పుజెందుచుండెనని సూచన. తొలిమొగులు తఱియనగ = తొలకరి మేఘముల గుబురు లనునటు, నృత్యంబు = నాట్యముయొక్క, ఒఱవు = విలాసము, అమరున్ = ఒప్పును, లలితగతి = మనోజ్ఞముగ, మెఱయు = ప్రకాశించు, శివుడు, అజుడు = పుటుకలేనివాడ నియు, అమరుడు = చావులేనివాడనియు, ఉఱు = గొప్పదైన, ఫలమును = ప్రయోజనమును, ఒసగున్ = ఇచ్చునని, ఎఱిగి= తెలిసికొని, నుతియింతున్ = కీర్తింతును.

## లయహారిణి :

కరనికర మురువిటపవరములన గరతలము
అరుణరుచిఁ దలిరులనఁ గరజములు పుష్పో
త్కరమనగ, వనరుహజ హరిదనుజ మునిమనుజ
సురగగన చరభుజగ గరుడగణ యక్షే
శ్వరుల కతిదయనొసఁగు వరఫలము లనిశమును
భరితమయి మధుసమయ సురవరమహీజ
స్ఫురణ కెనయనఁదనరు వరదుహిత నటనరతు
బరమపరుఁబరమగురు) బరము నతియింతున్

- ఈ వృత్తమునందు శివుడు ఈప్సితార్థదాయియైన వసంత సమయ కల్పవృక్షముతో బోల్చబడినాడు - అన్ని వృక్షములవలె కల్ప తరువుగూడ వసంతకాలమున చిగిర్చి పూచి ఫలభరితమగును. కాదేని మధుసమయ సురవరమహీజమనుట నిరర్థకపద ప్రయోగమగును. శివుడు వరదుడు = వరములొసగు నతని చేతులు కల్పవృక్ష శాఖల వంటివి. ఎఱ్ఱనైన యఱచేయి చిగురు, నఖములు పుష్పోత్కరము.

కరనికరములు = చేతుల సమూహము, ఉరు = గొప్ప దగు, విటపవరమునన్ = మేలుకొమ్మలనగా, కరతలము = అఱ చేయి, అరుణరుచిన్ = ఎఱ్ఱని కాంతివలన, తలిరులన – లేత చిగురులనగా, కరజములు = చేతి వ్రేళ్లయందలిగోళ్లు, పుష్పో త్కరములు = పూలప్రోవు, అనగ = నాగ,.

వనరుహజహరిదనుజమునిమనుజసురగగనచరభుజగ గరుడగణ యక్షేశ్వరులకు, వనరుహజ = తామర చూలియైన బ్రహ్మకును, హరి= విష్ణువునకును, దనుజ =అసురులకును, ముని= తపస్వు లకును మనుజ= మనుష్యులకును, గగనచర = ఆకాశగాములకును, భుజగ = సర్పములకును, గరుడగణ =గరుడుల సమూహముకును, యక్షేశ్వరు లకు = యక్షుల ప్రభువులకును, అతిదయన్ = మిక్కిలిదయతో, అనిశమును = ఎల్లప్పుడును, వరఫలమును = కామితార్థములను పండ్లను, భరితమయి = (ఫలములతో) నిండినదయిన, మధు సమయ = వసంతకాలమందలి, సురవరమహీజ = కల్పవృక్షము యొక్క, స్ఫురణకు = శోభకు, ఎనయనన్ = సమానమైనట్లు, తనరు = ఒప్పు, వరదు = కోరిన కోర్కెల నొసగువాడును, హితనటనరతు = మనోజ్ఞమైన నృత్యమునందాసక్తుడును, పరమ పరు = పరాత్పరుడును, పరమగురు = శేషాది గురుడును అగు, పరము = పరమేశ్వరుని, నుతియింతున్= కీర్తింతును.



# డమరు ధ్వని

శ్రీ సీరపాణి

ప్రాతస్సంధ్యావదనం
జేవురించె వల్లద్దిగ్!
అరుణార్కుని రక్తతిలక
ముగదాల్చిన కాళికవలె.
దిక్కులేని పక్షుల రొద
పిక్కటిల్ల రోదసిలో
రెక్కలన్ని ఒక్కుమ్మడి
తిండ్రించెను గాండ్రించెన
చిక్కం కట్టిన చీకటి
పొట్ట చీల్చి వేయాలని
బాకుల వలె రేకులన్ని
బరితెగించి నిలిచాయి.
అంభోనిధి గర్భంలో
ఆవులించె బాడబాగ్ని
వహ్ని కుధర కుహరంలో
"లావా" గుడుసుళ్ళు తిరెగె
అన్నార్తుని కడుపులోన
ఆకలి మంటలు రేగెను.
పరాజితుని గుండెలోన
ప్రళయ ఘంటికలు మ్రోగెను.
ప్రతి యువకుని హృదయంలో
ప్రభవించెను ప్రగతికాంక్ష
రుధిరంలో అనలద్యుతి
ధమనుల్లో డమరుధ్వని.

# శిష్టుల భాషా విశిష్టత

## శ్రీ టి. జి. కృష్ణారావు

పట్వాకతి చేతబట్టి, కవచమూ శిరోవేష్టనమూ ధరించి, పామర జనాన్ని దరిజేరనీయకుండా తొలగించుకుంటూ సుదూరమైన రాజమార్గంలో ప్రయాణిస్తూ, సామాన్యుల్ని సంభ్రమాశ్చర్యాలతో ముంచెత్తుతున్న గ్రాంధిక భాషా సరస్వతిని 'నీ వెవరి సొత్తు'వని నిలదీసి ప్రశ్నించి, జవమూ, జీవమూ గల వ్యావహారిక భాషకు సాహిత్య గౌరవాన్ని ప్రోదిచేశారు గిడుగువారు. ఆనాటి పండితులతో గిడుగువారు అసహాయశూరులై పోరాడేరు. గ్రాంధికవాదులు ఎంతకీ తమ భాష నిర్దుష్టమైనది గానే భావించారు గాని తమ భాషలో ప్రవేశించిన గ్రాంధిక విరుద్ధ ప్రయోగాన్ని చూడలేకపోయారు. ఏ వ్యాకరణాలని తాము ప్రమాణంగా భావిస్తున్నారో ఆ వ్యాకరణాలకి విరుద్ధంగా తాము వ్రాసిన గ్రంథాలో ప్రయోగించిన గ్రాంధిక భాష ఉంటోందని గ్రహించలేకపోయారు. జీవద్భాష నిత్యనూతనమైందనీ 'ప్రవాహినీ దేశ్యా' అని మన లాక్షణికులు చెప్పినట్లు, ఇది స్రోతస్విని అనీ భావించలేకపోయారు. తత్కారణంగా వ్యావహారికాన్ని ప్రాచుర్యం పొందకుండా కొన్నాళ్లు నిరోధించినా, ఎల్లకాలమూ ఆ ఉప్పెనని ఆపలేకపోయారు. కాగా వ్యావహారికం సాహిత్యంలో కాలూదింది.

సాహిత్యంలో ప్రవేశించిన వ్యావహారికం సామాన్య జనుల వ్యవహారికంకన్నా భిన్నమైంది. దీన్ని ప్రత్యేకించి 'శిష్ట వ్యవహారిక' మన్నారు. ఇది అటు గ్రామీణుల మాండలికానికీ, ఇటు గ్రంధస్థ భాషకీ విరుద్ధం. శిష్టుల వ్యవహారంలో గల భాషని మాత్రమే ప్రమాణంగా స్వీకరించి శిష్ట వ్యావహారికంగా సాహిత్యంలో ప్రవేశపెట్టారు. కాని శిష్టులనే వారెవరనేది ప్రశ్న. ఇది ఆలోచించవలసిన విషయం. వ్యవహర్తలలో అత్యధిక సంఖ్యాకులు శిష్టులుగా పరిగణింపబడటంలేదు. అక్షరాస్యత కూడా శిష్టతకు ప్రమాణం కాదు. ఉన్నతమైన నాగరికత గల వాళ్ళు మాత్రమే శిష్టులుగా పరిగణింపబడుతున్నారు. కాని యీ శిష్టులనిపించుకుంటూన్న వాళ్లు కూడా సర్వే సర్వత్ర సర్వజ్ఞులు కారు. ఒక్కొక్క సారి శిష్టుల భాషకన్నా, పామరుల భాష వారి శకలంగా సాధువై వుంటోంది. సాహితీ రంగంలో నిరంతరంగా ఏకఛ్ఛత్రాధిపత్యం వహించిన అగ్రవర్ణాల వారి భాష శిష్టుల భాషగా అంతటా ప్రమాణీకరించబడలేదు.

### యాస భాష

ప్రమాణీకరించిన భాషలో పామరుల వ్యవహారంలో గల 'ఎండలా నలిగిపోతన్నావు?', 'పెందిలి పాల్దారా', 'మీ బుగత గోరి కాడి కెల్తావురా?' ఇత్యాది ప్రయోగాల్లోని యాస కనిపించదు. అదే విధంగా అగవర్ణాలవారి భాషలోని 'వెళ్ళిపోచాడు', 'నాకూష్టం', 'అమ్మ రమ్మంఛాంది' మొదలైన ప్రయోగాల్లోని యాస ప్రామాణిక భాష కాదు. 'వెళ్ళిపోయొచ్చాడు', 'నాకు జ్వరం' 'అమ్మ రమ్మంటోంది' — అనే రకంగా ఈ రూపాలు ప్రామాణిక భాషలో ప్రయోగించబడతాయి. సర్వ వర్ణాలవారికీ భాషలో వేర్వేరుగా ఇటువంటి యాస వుంటుంది. దీనికి కారణం ఆ భాషా వ్యవహర్తల సమూహాల సాన్నిహిత్యం మాత్రమే. ప్రాచీన బ్రాహ్మణాగ్రహారాలలో బ్రాహ్మణ కులంవారు ఒక ప్రత్యేక భాషా వ్యవహర్తల సముదాయంగా ప్రత్యేక మాండలికం కలిగిఉండేవారు. నేటి కాలంలో ద్వైతీభావాలవీటు, పట్నాల్లో వివిధ ప్రాంతాలు నివాసం గలవారు తమ కులానికి ప్రత్యేకంగా వుండే యాసను కోల్పోతారు. స్కూల్లో చదివిన పిల్లల భాష స్వకీయమైన భాషయొక్క తొల్పులటి యాసని దూరం చేసుకుని కొత్తరూపు దిదుకుంటుంది. అలాగే వేర్వేరు వృత్తులవారివిషయం కూడా అలాంటి ప్రత్యేకత గల యాసభాష ప్రయోగార్హమైన నాటకాల్లో యక్షగానాల్లో సాంఘౌచితితో ప్రవేశపెట్టవలసిందే గాని, సాహిత్య వ్యవహారానికి ప్రామాణిక భాష మాత్రమే ఉపయోగపడుతుంది.

## మహాప్రాణాల ఉచ్చారణ

ప్రామాణిక భాషలో మహాప్రాణాలు గల చోట్ల పామరులు అల్పప్రాణాల్ని ప్రయోగిస్తారు 'బాద', 'బయము', 'బూమి'—అని యీ విధంగా ఒత్తులు తొలగించి పలుకుతారు. ప్రామాణిక భాషలో 'బాధ', 'భయము', 'భూమి'—ఇత్యాదిగా వ్రాస్తారు చదువుకొనే కాలంలో ప్రామాణిక భాష పట్టుబడకపోవడంచేత కొందరు వీటిని తారుమారు చేస్తుంటారు కూడా. 'బాధ' 'భేధము' అనే రీతిగా లేని చోట్ల వత్తులు పెట్టి ఉన్నచోట్ల తీసేస్తారు కాని తెలుగు భాషకి మహాప్రాణాలు లేనిస్థితి సహజమైనది కాబట్టి సాధారణంగా అల్ప ప్రాణమే సాధు రూపంగా నిలవాలి కాని అంతటా ఇలా జరగడం లేదు బ్రాహ్మణులలో కొందరు 'భావగారు' అని ఉచ్చరిస్తారు కాని 'బావగారు' అనేది శిష్టరూపంగా ప్రమాణీకరించబడింది శిష్టులుగా భావించబడిన బ్రాహ్మణుల ఉచ్చారణ కాక, తెలుగుదనానికి దగ్గరగా వున్న పదమే ప్రమాణీకరించబడింది ఈ పదం సంస్కృత 'భావుక' పదం నుండి వచ్చింది ఆంధ్ర వాచస్పత్యమూ, సూర్యరాయాంధ్ర నిఘంటువూ ఈ పదం సంస్కృతంనించి స్వీకరించిన రూపంగా పేర్కొంటున్నాయి అంటే ఈ పదాన్ని ప్రమాణీకరించడంలో ఉత్పత్తిగాక, ఆరోపిత లక్షణమే ప్రాధాన్యం వహించింది.

వేరొక పదాన్ని పరిశీలిద్దాం 'దారము' అనే దాన్ని కొందరు 'ధారము' అని పలుకుతారు ఇది * 'దోరా' అనే మహారాష్ట్ర పదా

---

* 'దారం' అనే పదాన్ని బ్రౌన్ నిఘంటువు ఈ క్రింది విధంగా చూపింది

దారము N S. Thread, Cord, String, Rope.
A match for fier

సూర్యరాయాంధ్ర నిఘంటువు యిలా చూపింది. దారము, వి. (క దార) ౧ సూత్రితాడు. సూత్రము

సీ.. తనరు సూత్రము త్రాడు దారమన్గ
ఆం. భా. ౨—౨౬౪.

౨ త్రాడు, చేత్రాడు.

ద్వి పద పడి యీ్యాకియు బగలెల్ల నడచి,
వెదకుచు మాపట వేలముల్ చేరి,
చనం బిన ముందట వెనుకను నోడి
...గారా మొసంగ రా యనుచు.
(పండితా పర్వ 388 పా)

ద్వి ఘా మతి యొకడు లేడా మరి నాథ,
దార మొసంగరా ధర్మాత్ములార
(పండితా పర్వ 345 పా)

వావిళ్ల వారి నిఘంటువు దీనిలో రెండవ ద్విపద మాత్రం ఉదహరించి, ఆంభా ప్రయోగం చూపి మిగిలినవి యథాతథంగా సూ.రా.ఆం. నిఘంటువులో లాగే వ్రాసింది.

ఆంధ్ర వాచస్పత్యము,
దారము, దే వి 1. చౌర్యము చూ, ముచ్చిలి
2 సూత్రితాడు, చూ సూత్రము 1

అని చూపింది దీనిలో 'ముచ్చిలి' వద్ద ఏమీ లేదు 'సూత్రము' దగ్గర వ్యుత్పత్తి విషయమై చెప్పుకోదగ్గదేమీ లేదు శబ్ద రత్నాకరం దీనిలో వున్నట్టే వ్రాసింది

తమిళ, మళయాళ భాషలలో 'దార' అనే పదం వాడుకలో లేదు 'నూల్' అనేది ఉపయోగంలో వుంది తెలుగులోనూ 'నూలు' అనేది ప్రయోగంలో వుంది 'నూల్', 'ఇరట్టినూల్', 'జవిలిపోగు' 'జవులి వస్త్రాలు' అనే రీతి వ్యవహారం కన్పిస్తుంది

నన్నయ పద ప్రయోగ కోశం, నన్నెచోడ పదప్రయోగ కోశం 'దారం' అనే పదాన్ని చూపడంలేదు
'దారం' అనే పదం ప్రథమంగా శైవ వాఙ్మయమైన పండితారాధ్య చరితలో కన్పించడం, కన్నడంలో 'దార' అనే రూపం ప్రచారంలో వుండటం చూస్తే ఇది కన్నడంలో నుండి తెలుగులో ప్రవేశించి వుండొచ్చు. మహారాష్ట్ర భాషలో దోరా అని దారానికి వాడుక రూపం. హిందీలో 'డోరి', 'డోర్' అనే రూపాలున్నాయి. సంస్కృతంలో 'దార' అనేది 'సూత్ర' మనే అర్థంలో లేదు.

పరిశీలించగా రూపార్థ సామ్యాల్నిబట్టి మహారాష్ట్ర నుండి కన్నడంలోకి, కన్నడంలోంచి తెలుగులోకి 'దార' అనే పదం ప్రవేశించినట్టు కనిపిస్తోంది. 'ఆ,ఓ' గాను 'ఓ,ఆ' గానుమారడం వాడుకలో సహజం.

నికి జాలి పదం 'ఓ'కారం 'ఆ'కారంగా మారడమే కాని దీనిలో మహాప్రాణత లేదు. అతి శుద్ధంగా పలుకుతున్నామనే భ్రాంతిలో ఈ మహాప్రాణత కలుగుతోంది దాత్రు, గ్రహీత్రు భాషలు రెంటికీ సహజమైన అల్పప్రాణతే ప్రమాణీకృతమైంది. 'ధారము' అనే రూపం స్వీకరించబడలేదు.

## 'శ, ష, చ,' ల వినిమయం

పామరుల ఉచ్చారణలో 'చ'కు బదులు 'స' వినిపిస్తుంది. 'చదువు'— 'సదువు', 'చుక్క—సుక్క', 'పుష్యమి' — 'పుస్సెమి' మొదలైన పదాలలో 'చ'కు బదులు 'స', 'ష'కు బదులు 'స' పామరుల భాషలో వినిపిస్తాయి శిష్టులనిపించుకుంటున్న వాళ్ళలో కూడా ఈ 'స'కారం ప్రవేశిస్తుంది 'చ'కి బదులుగా

'చదును' అని గాక 'సదును' అనే శిష్టులు ఉపయోగిస్తారు. 'పీపు పదునై పోతుంది' అని ప్రయోగం వినిపిస్తుంది. తెలుగులోని గసడదవాదేశం ఈ 'చ, స'ల మార్పుకు గల బహుళ ప్రచారానికి నిదర్శనం అలాగే 'శ' అనేది పామరుల ఉచ్చారణలో 'సెంఖం', 'సెంకరుడు'— అనే విధంగా 'స'గా వినిపిస్తుంది. తాము సరిగా ఉచ్చరిస్తున్నామనే భ్రాంతిలో 'చేశాడు', 'రాశాడు', 'వచ్చేశి'— అని యీ రకంగా కొందరు శిష్టులు వ్యవహరిస్తారు. ఈ పదాలలో ఉండవలసిన రూపం 'స'కారమే గాని 'శ'మాత్రం కాదు. 'చేయు' అనే ధాతువు వివిధ పరిసరాల్లో వివిధ రూపాలతో కనిపిస్తుంది.

'చేయ బోతున్నాడు', 'చెయ్యాలి' అనే చోట్ల 'య'గాను 'చేస్తూ', 'చేస్తాను', 'చేసి' అనేచోట్ల 'య'కు బదులు 'స' గాను కనిపిస్తుంది నిషిద్ధమైన వర్ణసంయోగం వారిస్తూ ఈ రూపాలు ప్రవర్తిల్లేయి ఇందులో 'య'కారం 'స'కారంగా మారడానికి చారిత్రక కారణం వుంది. ప్రాచీన ద్రావిడ భాషలో 'స, య'లు వినిమయ వర్ణాలు.

'పయ్—' ధాతువుకు పయిడి, పయిరు, పయిటలి, పయ్యరు, పసరిక, పసిడి, పసిమి, పసుక అనే 'స,య' వర్ణాలు రెండింటితో కూడిన రూపాలున్నాయి. ఈ విధంగా 'చేసాడు', 'రాసాడు', 'వచ్చేసి' — అనే పామరుల వ్యవహారమే ప్రమాణీకరించబడింది.

## పదాది వకారం

పామరుల వ్యవహారంలో పదాది వకారం లోపిస్తూ వుంటుంది. 'వెళ్ళిపోయాడు' అనడానికి 'ఎళ్లిపోయా'డనీ, 'వేషం' అనే దాన్ని 'ఏసం' అనీ ఉచ్చరిస్తారు. ఇది శిష్టుల వ్యవహారంలో కూడా వినిపిస్తుంది 'బట్టలు విప్పుకోవడం' అనే మాటను 'ఇప్పుకోవడం' అని కూడా వ్యస్తంగా అనడం వింటూంటాము. మూల ధాతువు 'విర్' అనే దాన్నో నుండి వచ్చిన ధాతువు 'విప్పు' అనీ, దీని రూపాంతరం 'విచ్చు' అనేదనీ శ్రీ భద్రిరాజువారు 'Telugu Verbal bases' అనే గ్రంథంలో సూచించారు. శిష్టుల ఉచ్చారణలో ప్రవేశించినా పదాది వకారాన్ని విడువడం సర్వత్రా కానరాకపోవడంచేత కాబోలు ఈ రూపం నిఘంటువుల కెక్కలేదు. సంధిలో 'వచ్చేశారు' మొదలైన చోట్ల 'వ'కార లోపాన్ని శిష్టులు కూడా పాటిస్తారు. ఆది వకారం లేని రూపాలన్నీ ప్రమాణీకరింపబడే రోజు మున్ముందు రావచ్చు

స్వచ్ఛంగా ఉచ్చరిస్తున్నామనే భ్రాంతిలో లేని 'వ'కారం పదాదిని చేర్చడం కూడా కద్దు 'అన్నం' అనే సంస్కృత పదానికి ముందు 'వ' చేర్చి 'వణ్ణం' అంటారు. కొందరు శిష్టులనిపించుకుంటున్న వాళ్ళు.

## ఉభయ వ్యవహారంలో రూపాలు

పామరుల వ్యవహారంలో గల కొన్ని రూపాలు శిష్టుల వ్యవహారంలో సైతం కన్పిస్తాయి. కాని వీటిని ప్రమాణ భాషలో స్వీకరించలేదు. 'బొట్టి' అనే పదం 'బాలిక' అనే అర్థంలో ప్రయోగిస్తారు. బ్రాహ్మణుల కుటుంబాల్లో 'ఆడబొట్టె' అనే పదంలో 'బొట్టె'ను ప్రయోగించినా ప్రామాణిక రచనలో ప్రయోగించరు. 'అప్ప' అనేది కూడా పామరుల నిత్యవ్యవహారంలో వుంది కాని నేటి గ్రంథస్థ వ్యావహారిక భాషలో ఉపయోగించరు 'అప్పజెల్లెలు' అనే పదంలో శిష్టులు నిరాకే పణీయంగా ఈ పదాన్ని ఉపయోగిస్తున్నారు. 'అప్ప' 'అప్పగారు' శిష్టుల్లో కొందరు క్వచిత్తుగా ఉపయోగిస్తారు కూడా.

నేడు పామరులు ప్రయోగించే 'బాపవాడు', 'అయ్య' మొదలైన పదాలు ప్రాచీన కావ్యాల్లో ప్రయోగించబడేవి. క్రింది ప్రయోగాలు పరిశీలించండి.

**అయ్య :**

'మా యయ్య యమ్మని కిం...'

(ఆం భార.ఆది 4 ఆ 35)

'మా యయ్యకు బాయక,
పని చేయుచు .. .
మీ యయ వెండి మహిమలు
నాయొద్దన పలుక నీకు నానయులేదే'

• (ఆం. భార. ఆది 3 ఆ 137)

ఇవి గాక నన్నయ అర్వాచీనతానికి పెద్దపీట వేసిన నన్నిచోడుడి పారుష్యం, ‘అయ్య’ అనే పద ప్రయోగించాడు

‘మన్నయ్య వీరు సేసి నీవెక్కడ పోయితయ్య’
(కుమార 5 ఆ 80)

‘మీయయ్య మీరు వనవా
సాయాసము విస్తరించి యభ్యుదయమునన్’
(ఆం భార ఉద్యో 1ఆ 260)

‘అన్నయ్యుం దమ్ములుం తమకు నయ్య నగం
బిలవేడి కానకిట్లున్నను……
(ఆం.భార ద్రోణ 5ఆ32)

‘అయ్యల గంటి మంచుం బుల కాంకురముల్’
(భాగ 10 పూ525)

బాపడు :

అంతం బెద్ద బాపనయ్యల యానతి
వడసి. …….’
(అచ్చ రా బాల 192)

‘నందుండు మాకుంగాదిలి,
బందుగుం డాతనికి నొజ్జ బాంపడ వగుటన్’
(నీలా. 1ఆ192)

‘అనుటయు బాపనయ్య కత డర్మిలి
నిట్లని పల్కె’
(నీలా 1 ఆ)

‘చాటు ప్రౌఢిం బిసాళ మాడెదవు కాసల్నాటి
బాపండ నో’…
(క్రీడా 62)

ఈ విధంగా ప్రయోగాలే కాక శబ్దరత్నాకరం బాపడు, బాపత, బాపన, బాపనక్క, బాపనుడు, బాపతీకము అనే వివిధ పదాల్ని ఆరోపాలుగా చూపింది

ఈ ప్రయోగాలు చూసే శిష్టులు తమ భాషని పామరుల నుండి రోజురోజుకీ దూరంగా తీసుకుపోతున్నట్లు లేదా తీసుకుపోయినట్టు కన్పిస్తుంది లేకపోతే కావ్యప్రయోగాల్లో కన్పిస్తున్న ఈ పదాల నేటి ప్రామాణిక వ్యావహారికంలో లేకపోవడానికి కారణం ఏమనుకోవాలి? పామరులు తమకన్నా నాగరికులనిపించుకుంటున్న శిష్టులకు సమీపమైన భాష మాట్లాడాలని అభిలషించగా శిష్టులు పామరులకన్నా తమ ప్రత్యేకత నిలుపుకోవాలని ఆశించారు. పామరులు నాగరికులతో మాట్లాడేటప్పుడు నాగరికుల వ్యవహారంలోని ఆంగ్ల పదాలూ, సంస్కృత పదాలూ ప్రయోగించడానికి కుతూహలపడటమూ, నాగరికులు పామరులు తమలాగా పలకలేకపోడాన్ని వేలెత్తి చూపడం దీనికి నిదర్శనం

## ప్రమాణీకరణ

ఇలా పరిశీలించుకుంటూ పోతే శిష్టుల భాషలోని కొన్ని విశేషాలు శిష్ట వ్యావహారికంలో లేవనీ, పామరుల భాషలో లోపాలుగా భావిస్తున్న పదిష్టుల భాషలో కూడా వున్నాయనీ తెలుస్తుంది. చారిత్రకంగా సాధువైనంత మాత్రాన ఒక రూపం ప్రమాణీకరించబడుతుందని చెప్పలేము. శిష్టులైనవారి భాష పామరుల కంటె విశిష్టమైనదిగాకాక కొన్నిచోట్ల శిష్టతను కోల్పోయినదిగా కన్పిస్తుంది. ఆ అర్థంలోనైతే ‘విశిష్టత’ అంటే ‘వినష్ట శిష్టత’ అని చెప్పాల్సి ఉంటుంది. అందుచేత ప్రమాణభాషంటే శిష్టవ్యావహారికం అని చెప్పలేము శిష్టులూ, పామరులూ ఉపయోగించే భాష ప్రమాణీకరించబడి నేటి ప్రామాణికభాష ఏర్పడుతోంది భాష ఏ సూత్రాలమీద ప్రమాణీకరించబడుతుందో తెలిసిననాడు ఆ సూత్రాలప్రకారం దానిని నడిపించడం ప్రమాణీకరించడం అనిపించుకుంటుంది. ‘అది సాధ్యమా’ అనేది వేరే విషయం శిష్టులూ, పామరులూ అనే భేదం లేకుండా ఏ భాషైనా దానంతట అదే ప్రమాణభాషగా రూపుదాలుస్తుంది. దీనిలో ఒకరి ప్రమేయం లేదు.

**‘The real problem in language standardization is to get to know and be able to put into operation the means of making the choice acceptable to all concerned and help it spread at the discarded alternative’**

అని శ్రీ ఘటాగే చెప్పిన వాక్యాల్ని ఈ సందర్భంలో స్మరించుకోవాలి.

# 'రేపు' లోకి

శ్రీ రామా చంద్రమౌళి

ఈ చీకటి గదిలో కూర్చుని
ఎన్నాళ్ళనుండి నిశీధిని విశ్లేషిస్తున్నానని...,
ఆత్మశోధనంతో మనిషినీ, మనసునీ వర్గీకరిస్తూ —
సృష్టిని చదువుతూ పోతూంటే ... ఒక్కొక్క గర్భచరిత్రలో
ఎన్ని విశ్వరూపాలు...ఎన్ని లయాన్విత నిక్వణ సంచయాలు —
అర్ధరాత్రి వెచ్చని నైట్క్లబ్బుల్లో కేబరే డాన్సులు,
కళ్ళతో మనుషులను తాగుతున్న కోర్కెలు,
పేవ్‌మెంట్లపై పశువులతోపాటు గురకలుపెట్టే బతుకులు,
గాజుల గలగలతో బేరాలు—
ఇవ్వాల్టి మల్లెపూల వాసనకూ, బ్రాందీ ఖర్చుకూ
"రేపు-" ఎవడి కన్నీటి బతుకో బలి
మార్చురీ గదుల్లో నిరుద్యోగుల ఆగిపోయిన గుండెల్లో సాగర ఘోషలు
రోడ్డుమీద చీరవిప్పుతూ నిలబడ్డ సినిమా పోస్టర్‌వంక చూస్తూ
పెదవులు చప్పరిస్తూ నిలబడ్డ యువతరం—
బెల్‌బాటమ్‌లు. ... బొడ్డుక్రింద చీరలు
పిచ్చికుక్కలా పరుగెత్తుతూ అరుస్తూన్న నాగరికత
అ శుస్పందనలు...వాంఛాతప్త ముదలు.. పొలికేకలు
ఓహ్—ఎన్ని ఛాయాపరంపరలు నా చుట్టూ
ఈ విశేషణంలో, ద్వైధీభావ సంఘర్షణలో మథనం పొందీ పొందీ
తలుపులు తోసుకుని
"బయటికి" పరుగెత్తుకొచ్చాను — అబ్బా
అంతా వెలుగు వెల్లువ — వెల్లువ — వెల్లువ.

---

# వేంకటాధ్వరి కవితా చమత్కృతి
# లక్ష్మీ సహస్రము

శ్రీ బులుసు వేంకట రమణయ్య

సంస్కృతభాషలో లలితాసహస్రనామం, విష్ణుసహస్రనామం, శివసహస్రనామం మొదలైన సహస్రనామాలు ఉన్నవి అవి పూజలకు ఉపయోగించేవి ఆ స్తోత్రాలు శ్లోక విబద్ధాలయి ఉండడంవల్ల కంఠస్థం చెయ్యడానికి అనుకూలంగా ఉంటాయి వాటిలో కొన్నిటికి విపులమైన వ్యాఖ్యానాలున్నూ కలవు. ఆ వ్యాఖ్యలు నామావళి వైశిష్ట్యాన్ని వివరిస్తున్నవి.

ఆ విధంగా కాక వెయ్యిశ్లోకాల్లో స్తోత్రంచేసే గ్రంథాలు కొన్ని ఉన్నాయి వాటిలో వేదాంత దేశికుల పాదుకాసహస్రం, వెంకటాధ్వరి రచించిన లక్ష్మీసహస్రం పేరుపడిన గ్రంథాలు

వెంకటాధ్వరి అనే పేరు కొంత వింతగా కనబడవచ్చు ఆతని అసలుపేరు వెంకటాచార్యులు. వారిది వడగల్ సంప్రదాయానికి చెందిన విశిష్టాద్వైత మత కుటుంబం ఈ సంప్రదాయానికి చెందినవారు యజ్ఞయాగాదులు చెయ్యడం ఉన్నది. ఇతని తాత, తండ్రి యాగాలు చేసినవారే! ఇతడున్నూ అధ్వరం చెయ్యడంవల ఇతనికి వేంకటాధ్వరి అనేపేరు వచ్చింది లక్ష్మీసహస్రం చివరనున్న శ్లోకం వల్ల ఈ సంగతి స్పష్టమవుతూ ఉన్నది.

ఆ శ్లోకం యిది —

'ఆత్రేయాత్రేయ గోత్రాభరణ నయ చణ
శ్రీనివాసాధ్వరీంద్రో
శ్రీమద్రామానుజాంఘ్రి భక్తి ప్రముదిత రఘునా
థార్యయజ్వాత్మజేన,
వేదాంతాచార్య పాదాంబుజ నిహితహృదా
వేంకటార్యేణ క్లుప్తం
రమ్యం లక్ష్మీసహస్రం పఠత దృఢతరం
నిత్యకల్యాణ కామాః.'

ఈ శ్లోకాన్నిబట్టి వెంకటాధ్వరి పండితునిది ఆత్రేయ గోత్రమని, తండ్రి రఘునాథాచార్యులని, తాత శ్రీనివాసాచార్యులని తెలుస్తున్నది

కాని, వెంకటాధ్వరి రచించిన విశ్వగుణాదర్శమనె కావ్యంలో ఇతని తాతపేరు అప్పయార్యుడని ఉన్నది.

'కాంచీమండల మండనస్య సుఖినః
కర్ణాట భూభృద్గురోః
తాతార్యస్య దిగంతకాంత యశసో
యం భాగినేయం విదుః,
అస్తోకాధ్వర కర్తు రప్పయగురో
రప్యేష విద్యన్మణేః
పుత్రః శ్రీరఘునాథ దీక్షిత కవిః
పూర్ణో గుణైరేధతే.
తత్పుత్ర స్తర్క వేదాంత తంత్ర వ్యాకృతి చింతకః,
వ్యక్తం విశ్వగుణాదర్శం విధత్తే వేంకటాధ్వరీ.'

ఇంతే కాకుండా విశ్వగుణాదర్శ, లక్ష్మీసహస్రాల రెండింటి చివరను ఉన్న గద్యల్లో ఇతని తాతపేరు అప్పయాచార్యులనే ఉన్నది. అప్పయాచార్యునికే శ్రీనివాసార్యుడనే నామాంతరం ఉండి యుండవచ్చును

ఆ గద్యలనుబట్టి, ఈ శ్లోకాలనుబట్టి వెంకటాధ్వరి పితా

సుహుడు తాతాచార్యులవారి మేనల్లుడని, కాంచీ నివాసియైన ఆ తాతాచార్యుల వారనేక యాగాలు చేశారనీ, కర్ణాటప్రభువైన కృష్ణ దేవరాయల గురువనీ తెలుస్తున్నది వ్యాఖ్యాత ఈ అభిప్రాయాన్నే తెలియజేశాడు. ఇంతేకాక, వెంకటాధ్వరి తండ్రి శ్లేషయమక చక్రవర్తి అనీ, వెంకటాధ్వరి తర్క వేదాంత వ్యాకరణాది శాస్త్రాలలో గొప్ప పండితుడనీ తెలుసుకోవచ్చు తండ్రివలెనే 'పుత్రుడుకూడా శ్లేష యమక కవిత్వాలలో ఉద్దండుడని లక్ష్మీసహస్రమునుబట్టి గ్రహించ వచ్చును.

వెంకటాధ్వరి ఎన్ని గ్రంథాలను రచించాడో తెలియలేదు. ఇతని విశ్వగుణాదర్శ, లక్ష్మీసహస్రాలు మాత్రమే వ్యాప్తిలో ఉన్నవి విశ్వగుణాదర్శ గద్యలో 'వేంకటార్య యజ్వనః కృతిషు విశ్వగుణాదర్శ చంపూః సమాప్తా' అని ఉన్నందువల్ల ఇతడు మరికొన్ని గ్రంథాలను రచించి ఉండవచ్చునని అనుకోవచ్చు.

లక్ష్మీసహస్రంలో 1009 శ్లోకాలున్నవి. అన్నీ లక్ష్మీదేవిని స్తుతించేవే! కవి ఈ గ్రంథాన్ని రచించడానికి ఒక కారణమున్నదట! వెంకటాధ్వరి దీనిని రచించుటకు ముందు విశ్వగుణాదర్శ చంపూ గ్రంథాన్ని రచించాడు. అందులో కృశాను, విశ్వావసులనే ఇద్దరు గంధర్వులను ప్రవేశపెట్టి అనేకవిషయాలను గురించి భూషణ, దూషణాలను చేశాడు. దేన్నీ విడిచిపెట్టలేదు దేవదూషణవల్ల తీరని వ్యాధి కలిగింది. దాన్ని పోగొట్టుకొనుటకయి లక్ష్మీదేవిని పెక్కువిధాల వర్ణించి, ఆమె అనుగ్రహం పొంది వ్యాధి నిర్ముక్తుడైనాడు. ఈ విషయాన్ని బాలబోధినీ వ్యాఖ్య ఇలా తెలుపుతున్నది.

> 'వేంకటాధ్వరి పండితేన నిఖిల విశ్వగుణదోష ప్రతిపాదక విశ్వగుణాదర్శ కావ్యకరణ ప్రమాదా దనిర్వాచ్య వ్యాధి సమాపన్నతయా బహుతర నిర్వేద ముపజగ్ముషా పునస్తత్పరి హారార్థం ...... శ్రీ రమాదేవ్యాఖ్యం దైవతమేవైతస్య కులాకుశల నిర్వర్తకతయా శరణీకరణీయత్వేన ఐకాంతికం మన్యమానేన......'

ఇందులో లక్ష్మీదేవి వర్ణన వివిధ వృత్తాలలో ఇరవైఅయిదు స్తబకాలలో మిక్కిలి రసవంతంగా సాగింది అవి క్రమంగా—ఆరంభ—ప్రాదుర్భావ — వక్ష — స్థలావస్థాన — కారుణ్య—కటాక్ష —ప్రయత్నం— మంగళ — సౌందర్య — శృంగార — ఐశ్వర్య — క్షాంతి — ఉత్సవ, ఔదార్య — యమక — నక్షత్రమాలా — విచిత్ర — వామవైభవ — పద్మవైభవ — అభీతి — పరిసంఖ్యా — దశావతార — చిత్ర — సంకీర్ణ — నిర్వేద — హాస బకాలు.

వీటిలో కొన్ని చిన్నవి కొన్ని పెద్దవి అన్నిటికన్నా పెద్దది సౌందర్యస్తబకం. దీనిలో రెండువందల ముప్పయిఅయిదు శ్లోకాలున్నవి. అన్నిటికంటె చిన్నది విచిత్రస్తబకం. ఇందులో పదకొండు శ్లోకాలే ఉన్నవి. మంగళస్తబకం, నిర్వేదస్తబకం. కూడా దానివలెనే చాలా చిన్నవి.

తాను విశ్వగుణాదర్శాన్ని చంపువుగా రచించడానికి కారణం చెప్పతూ వెంకటాధ్వరి "హరగిరా కస్య హి నస్యదేత మనసే మార్ద్వీక మృద్వీకయోః' అని గద్యపద్య సమ్మిళితమైన కావ్యం తేనె, ద్రాక్ష కలిపినట్లు మిక్కిలి మాధుర్యయుక్తమై ఉంటుందని తెలుపుతూ తన కవిత్వం తేనెలొలుకుతూ ఉంటుందనే ఆశయాన్ని వెల్లడించాడు. నిజంగా ఇతని కవిత్వం తేనెలొలుకుతూ ఉంటుంది. సాధారణంగా వినే వారికీ, చదివేవారికీ తలనొప్పి కలిగించే యమక, చిత్ర కవిత్వాలు కూడా — ఇతని రచనలో ఇంపుగానే సాగుతాయి శైలి ధారావాహిక మైనది. తాను చెప్పకోకపోయినా ఇతడుకూడా 'శ్లేషయమకచక్రవర్తి' అనే చెప్పవలసి ఉన్నది.

వెంకటాధ్వరి కవితా మాధుర్యాన్ని చూపడానికి లక్ష్మీసహస్రం నుంచి ఎన్నయినా ఉదాహరణలను చూపవచ్చును. వివిధ ఘట్టాల నుంచి కొన్ని శ్లోకాలనుమాత్రం దిఙ్మాత్రంగా వివరణతో కూడ చూపుతున్నాను—

(1) నాలుగవదైన కారుణ్యస్తబకంలోని 15వ శ్లోకం —

> "శౌరి శ్శ్రకాస్తి హృదయేషు శరీరభాజాం
> తస్యాపి దేవి! హృదయం త్వమను ప్రవిష్టా
> పద్మే! తవాపి హృదయే ప్రథితా దయేయం
> తామేవ జా గదఖిలార్తి శయాంశ్రయామి."

భక్తులు కోరేది దేవతల దయ. అది లభిస్తే, వారికి అసాధ్యమైన పని ఏదీ ఉండదు అన్నిటినీ అతిశయించిన ఆ దయ దొరకడం సులభంకాదు అది మిక్కిలి గూఢమైన ప్రదేశంలో ఉంటుందనే విషయం ఈ శ్లోకం వ్యక్తం చేస్తున్నది.

దీని అభిప్రాయం ఇది —

ఓ లక్ష్మీదేవీ! శరీరధారులయొక్క హృదయాల్లో విష్ణుదేవుడు ఉంటున్నాడు. ఆ దేవుని హృదయంలో నీవు ప్రవేశించి ఉన్నావు.

కారుణ్యమనేది నీ హృదయంలోనే ఉంటున్నది ఆ దయనే మేము అభిలషిస్తున్నాము.

లక్ష్మీదేవియొక్క దయనిగూఢమైనదని ఇందులో మనోహరంగా వర్ణించబడి ఉన్నది

(2) సౌందర్య స్తబకమనే ఎనిమిదవ స్తబకంలోని 22 వ శ్లోకం.

'చరణ నలిన యుగ్మం సంసృతిక్లేశ సింధో
స్త్వవ హరిసఖి ! సంతస్తారకం సంగిరంతే,
ఇదముచిత మవేమో యేన తత్సంశ్రితానాం
తతిరపి చ నఖానాం తారకాత్వం బిభర్తి :'

ఇందులో లక్ష్మీదేవియొక్క పాదపద్మాలు వర్ణించబడుతున్నవి దీని అభిప్రాయం ఇది —

విష్ణుదేవునికి పత్నివైన ఓ లక్ష్మీదేవీ! నీ పాదపద్మాలు రెండున్నూ సంసారక్లేశ సముద్రాన్నుండి తరింపజేసేవి — అంటే సంసారతారకాలు అని విద్వాంసులు చెప్తుతూ ఉంటారు ఇది మిక్కిలి ఉచితంగానే ఉన్నది ఎందుచేతనంటే — నీ పాదాలను ఆశయించిన గోళ్లకూడా 'తారకము లగుతున్నవి.'

సౌందర్యాన్ని వర్ణించేటప్పుడు గోళ్లను చుక్కలతో పోల్చడం సంప్రదాయం పాదాల నాశ్రయించియున్న గోళ్లే తారకాలయినప్పుడు పాదపద్మాలు సంసారతారకాలు అగుటలో ఆశ్చర్యంలేదని అభిప్రాయం. ఇక్కడ శ్లేషమూలంగా ఈ కల్పన సమర్థించబడింది. తారకాలంటే తరింపజేసేవని, చుక్కలని కూడా అర్థం !

(3) శృంగార స్తబకంలోని ఈ 33 వ పద్యాన్ని చూడండి—

'సరసిజవనే సంలీనాయా : సకౌతుక మిందిరే
సలిల విహృతౌ శౌరేర్లో లేక్షణస్య-ముఖస్య తే,
అలిక — వలితా లోల శ్యామాల కస్య, సరోరుహో
దలిక వలితా చ్ఛైవాలాఢ్యా దభూన్నభిదాగ్రహః'

"ఓ యిందిరాదేవీ ! నీవు వేడుకగా నీ భర్తయైన శౌరితో కూడా జలక్రీడలాడుటకై తామరకొలనులో ప్రవేశించినప్పుడు అక్కడి తామరపువ్వులమధ్యను నీ ముఖం పద్మంలాగే ఉండినది. చలించే నీ కన్నులు తుమ్మెదలవలెనే ఉండినవి. నుదుటిపై చలిస్తూఉన్న ముంగురులు నాచువలెనే కానవచ్చినవి అందువల్ల పద్మమేదో నీ ముఖమేదో తెలుసుకోవడం ఆయనకు సాధ్యపడలేదు '

ముఖానికి పద్మంతోనూ, చూపులకు తుమ్మెదలతోనూ, కేశాలకు నాచుతోనూ పోలిక కవి సమయసిద్ధమై ఉన్నది అది యిక్కడ ఎంతో చమత్కారంగా కూర్చబడింది.

(4) ఇక యమకస్తబకంలోని ఏభై రెండవ శ్లోకం

సురక్షయా దేవహితా దృశా౽వ మా౽
సురక్షయా దేవ హితాదృశావ మా,
ముదారమే దేహి గిరా విహానతా
ముదారమేధే౽హి గిరా౽విహా౽౽నతా.

ఇందులో మొదటి రెండుపాదాలూ ఒక్కవిధంగానూ, తర్వాతి రెండు పాదాలూ ఒక్కవిధంగానూ ఉన్నవి ఇందులో పాదయమకం ఉన్నది. వినడానికి ఇది దురవగాహంగా కనబడినా పదాలను విభజించే పద్ధతినిబట్టి అర్థం చేసుకోవడం సుసాధ్యమే.

దీని అర్థం : ఉదారమేధే= గొప్ప బుద్ధికల, రమే= ఓ లక్ష్మీ దేవీ! అహి =ఇక్కడ, అహిగిరౌ= శేషశైలమునందు, ఆనతా= పొంది ఉన్నదానవై, అసురక్షయాదేవ= రాక్షసులనాశము మూలము గానే, దేవహితా =దేవతలకు హితము కలుగజేయుదానవై అవమా= అవస్థితమైన కాంతిలేదానివై — కాంతిమతివై — లేదా రక్షకురాలవై , తాదృశా అటి, సురక్షయా =మేలైన సంరక్షణ చేత, మా= నన్ను, అవ= రక్షించుము, హి =ఇంకను, ముదాగిరా= సంతోషపూర్వకమైన వాక్కుతో, విహానతాం= హాని లేకుండుటను, దేహి =ఇమ్ము - కలిగించుము—అని.

ఓ లక్ష్మి దేవీ! నీవు శేషశైలంమీద ఉండి రాక్షసులను నశింపజేస్తూ, దేవతలకు మేలు కలుగజేస్తూ ఉన్నావు. నీవు నన్ను రక్షించాలని ప్రార్థిస్తున్నాను. ఇంతేకాక, ఆనందకరమైన వాక్కుతో నాకు హానిలేకుండా చెయ్యాలని కోరుతున్నాను—అని దీని అభిప్రాయం.

(5) పదిహేనవది నక్షత్రమాలాస్తబకం. సాధారణంగా ఇరవై ఏడు శ్లోకాలుగాని, పద్యాలుగాని చెప్పి- నక్షత్రాలు ఇరవైయేడు గనుక—నక్షత్రమాల అని నామకరణం చెయ్యడం ఉంటునుది.

వెంకటాధ్వరి కవి ఇలా స్వభికంలో—నక్షత్రాల పేర్లు వచ్చే విధంగా శ్లోకాలు రచించడం ఒక విశేషం.

విశాఖా నక్షత్రం పేరు వచ్చినట్లు చెప్పిన శ్లోకం.

"పూర్ణం వర్ణయితుం తవాంబ నిగమాః
న క్షమా భవన్ ప్రాభవం
యస్యాః స్వర్గణికా ముదం విదధతే
దాస్యేన లాస్యేన చ,
వాణీ సాపి విశాఖ దంతి ముఖయో
ర్మాతాపి జాతాదరే
ధన్యే చామరవీజనం రచయతో
ధత్తే కలాచిం శచీ"

"అమ్మా! లక్ష్మీదేవీ! నీ సామర్థ్యాన్ని సంపూర్ణంగా వర్ణించడానికి వేదాలకు కూడా సాధ్యం కాదు. అప్సరసలు నీకు సంతోషాన్ని కలిగించడానికి నీ సమక్షంలో నాట్యం చేస్తున్నారు. నీకు దాస్యం చేస్తున్నారు. సరస్వతీదేవియు, విశాఖ, వినాయకులకు తల్లియైన పార్వతీదేవియు నీకు ఇరు ప్రక్కల నిలిచి వింజామరలు వీస్తున్నారు. దేవేంద్రుని భార్య అయిన శచీదేవి నీ తమ్మ పడిగాన్ని పట్టుకొని వుంటున్నది"—అని దీని భావం.

ఇందులో విశాఖా నక్షత్రం పేరు వచ్చింది.

(6) ఇదే స్వభికంలోని ఒక శ్లోకాన్ని గమనించండి.—

"స్వబాధకాన్ సాధుజనోఽపి శక్తౌ
బాదేత సాశో దినుతే జగత్యామ్,
బాధావిధాతృ ర్భృశతి రరక్ష
రక్షః స్త్రియో ప్రత్యుత వాయుపుత్రాత్."

ఎంత సాధువయినా సరే—తనకు సామర్థ్యం ఉన్నప్పుడు తమ్ము బాధించేవారిని బాధించకుండా ఉండలేడు. ఇది లోకంలో సహజం. కాని, ఓ లక్ష్మీదేవీ! నీవు జనకరాజ పుత్రివై అశోక వనంలో ఉన్నప్పుడు రాక్షస స్త్రీలు నిన్ను బాధా పెట్టినా, హనుమంతుడివల్ల వారికి అపాయం లేకుండా, ఆ క్రూర రాక్షస వనితలను రక్షించావు ఇది చాలా విచిత్రంగా కానవస్తున్నది" అని దీని భావం!

ఈ విధంగా చూపాలంటే అనేక శ్లోకాలను ఉదాహరించ వచ్చును.

సామాన్యంగా స్తుతి శ్లోకాలు కొన్ని విన్న తర్వాత—విసుగు కలగడం సహజం. కాని, వర్ణన రమ్యంగా ఉన్నప్పుడు విసుగు కలగదు. వెంకటాధ్వరి చెప్పిన వెయ్యి శ్లోకాలూ ఒక్కొక్కటే ఒక్కొక్క వైశిష్ట్యం కలిగి వున్నందువల్ల—వినడానికి చదవడానికి కౌతూహలాన్ని కలిగిస్తూనే ఉంటాయి.

ఇట్టి ఉత్తమ స్తుతి కావ్యాన్ని రచించి వెంకటాధ్వరి మహాకవి తన కీర్తికి శాశ్వతత్వాన్ని సంపాదించుకున్నాడు.

దీన్ని 1906 వ సం.లో కాశీలోని చౌఖంబా పుస్తకశాలవారు దేవనాగరి లిపిలో చక్కగా సవ్యాఖ్యానంగా ముద్రించి ప్రకటించారు. దీనికి శ్రీనివాస పండితుడు రచించిన బాల బోధిని వ్యాఖ్య, కాశీ గవర్నమెంటు సంస్కృత కాలేజీలో ప్రొఫెసరుగా ఉండిన మానవల్లి రామశాస్త్రిగారు రచించిన అవతరణిక శ్రేణి అనే వివరణమూ ఉన్నవి. ఈ దాక్షిణాత్య విద్వత్కవి సార్వభౌముని కృతికి వ్యాఖ్యలతో, ప్రకటన మూలంగా భారత దేశమంతటా వ్యాప్తి కలగడంలో కాశీ నివాసులై, మహా విద్వాంసులైన ఆంధ్రులు శ్రీ మానవల్లి రామశాస్త్రిగారే కారకులైనట్లు తెలుస్తున్నది.



# శ్రీ భీమేశ్వర పురాణ ప్రబంధము

## డా. కేతవరపు వేంకట రామకోటి శాస్త్రి

ఈ భీమేశ్వర పురాణమునకు మూలము స్కాంద పురాణమునందలి గోదావరీ ఖండమనియు అదియే ఆ పురాణమునకు ప్రాభవ భూతి మనియు శ్రీనాథుడీ గ్రంథముయొక్క అవతారికలో (1-30,27) వ్రాసినాడు. మరియు నీ పురాణ ప్రబంధమును—పూర్వ ఖండంబునం బారాశర్యుండు నిజాపరాధంబు కారణంబుగా విశ్వనాథుచేత నధిక్షేపింపబడి వారణాశి వెడలియెనని విన్నవారగుటం జేసి యటమీది వృత్తాంతంబు వినువేడుకను (1-120) నా శౌనకాదిమునులు కథకుని అడిగినారనియు చెప్పి తదనుసారముగా ఈ 'పురాణము కథనము చేయబడినట్లు ప్రారంభించెను. ఇది గోదావరి ఖండము "శ్రీమద్దాక్షారామ భీమేశ్వర మాహాత్మ్య సంయుతంబగుట జేసి భీమేశ్వర పురాణంబనం బరగు" (1-30) చున్నది. దీనికంటె స్కాంద పురాణమున ముందున్న ఖండమేది? అందుకదా వ్యాసుడు కాశి వెడలిన కథ యుండవలయును? స్కాంద పురాణము పంచాశత్ఖండ మండితమని శ్రీనాథుడు ఈ భీమేశ్వర పురాణమునందును (1-30) కాశీఖండము నందును గూడ 'పంచనాగర ఖండంబు, కమలాలయ ఖండంబు, రేవా ఖండంబు, ఏకవీర ఖండంబు, మైలార ఖండంబు, గోదావరీఖండంబు లివియాదిగాగల పంచాశత్ఖండంబులందు" (1-80) అని వ్రాసిపెట్టినాడు. గోదావరీ ఖండమునకు పూర్వఖండముగా నిందు మైలార ఖండము కనిపించుచున్నది. ఈ యారింటిలో చేరక మిగిలిన నలుబది యారింటిలో కాశీఖండ మొకటియా? అయినచో గోదావరీ ఖండముకు పూర్వఖండమందుండవలసిన వ్యాసుడు కాశీనగరమును వెడలిన కథ కాశీఖండము చివర యెట్లున్నది? సప్తమాశ్వాసమున (126-197) డెబ్బది గద్య పద్యములుగా నావ్యాసుని కథను శ్రీనాథుడే వ్రాసినాడు. గోదావరీ ఖండమునకు అందలి విషయమును బట్టి భీమ ఖండమని భీమేశ్వర పురాణమని పేరుపెట్టినట్లే, దానికి పూర్వ ఖండమైన మైలార ఖండమునకు కాశీఖండమని పేరున్నదా? ఉన్నచో దాని కోసమే వ్యాసుని కథ యుండవచ్చును. అప్పుడు కాశీఖండముతరువాయిభగా భీమేశ్వర పురాణము వచ్చినదని చెప్పవలయును. కాని శ్రీనాథుని యొక్క కృతుల వరుసలో ముందు భీమేశ్వర పురాణమే రచింపబడినది. ప్రౌఢనిర్భర వయః పరిపాకమున ఈ పురాణమును "ఆంధ్ర భాషా ప్రబోధము"గా చెప్పిన మీదట ఈ దక్షిణ కాశి యందున్న వ్యాసాగస్త్య మహర్షు లిరువురు కాశికా నగరము వెడలి రావలసిన కారణ కథలు కాశీఖండమునందుండుటను బట్టియు, మరియు నీ దక్షిణ కాశిమాహాత్మ్యమును అసలు కాశిమాహాత్మ్యమును దీప్తిమంతము చేయగలదన్న ఆలోచనను బట్టియు శ్రీనాథుడు "ప్రాయమంతకు మిగుల కైవ్రాలకుండ" కాశికా ఖండమును "తెనుగు జేసెద"నని చేసి యుండవచ్చును.

అసలు స్కాంద పురాణము యొక్క స్వరూప స్వభావము లంత సుగమములుగా లేవు అందు సంహితా విభాగ మొకటి కలదు. ఖండికా విభాగ మొకటి కలదు సంహితలయందే ఖండములున్నవన్నచో ఏ సంహిత యందే ఖండములున్నవో చెప్పవలయును. శ్రీనాథుడు చెప్పలేదు. (కాశీ. 1 80) కాశీ ఖండము ఏ సంహిత లోనిదో తెలియదు. మరియు కొన్ని బ్రహ్మవైవర్త బృహన్నారదీ యాది పురాణములయందు సంహితా విభాగ ప్రసంబంధము లేకుండ మొత్తము స్కాంద పురాణము సప్తఖండమండితముగా చెప్పబడి యున్నట్లును అందు నాల్గవదిగా కాశీ ఖండము పేర్కొనబడి యున్నట్లును పరిశోధక విద్వాంసులు చెప్పుచున్నారు. ఆ యేడు ఖండములలో శ్రీనాథుడు పేర్కొనిన గోదావరీ ఖండము లేదు. కాశీ ఖండము తరువాత అవంతికా ఖండము కలదు. అవంతికా ఖండము గోదావరీ ఖండము కాదు. అందువలన కాశీ ఖండము చివరకు గల వ్యాసనిష్కాస కథానంతర కథగా గోదావరీ ఖండమని చెప్పబడెడు భీమేశ్వర పురాణము ప్రారంభింపబడుటకు వీలు లేదు. కానీ ప్రారంభింపబడినది కదా !

స్కాంద పురాణమునకు దేశకాలముల నిడివిమీద సంహితా విభాగమునకు కుదిరిన ఏక వాక్యత ఖండికా విభాగమునకు కుదురుట లేదు. స్కాంద పురాణమని చెప్పబడుచున్న గ్రంథభాగములలో దేనిని

ఎవరెప్పుడు వ్రాసి చేర్చినదియు చెప్పుట సాధ్యముకాదు. అది ఒక కాలమున ఒకరిచేత వ్రాయబడిన పురాణముకాదు. చాల పురాణముకీ పరిస్థితి యున్నను స్కాందమునకు మరియు ఎక్కువ.

మరి శ్రీనాథుడు తన భీమేశ్వర పురాణ ప్రబంధమును "స్కాందంబను నాది పురాణంబునందు గోదావరీఖండంబు" నకు చెప్పబడిన "ఆంధ్రభాషా ప్రబంధంబు" (1-30) అని స్పష్టముగా ప్రకటించినాడు కదా ? నిజమే కానీ స్కాందమునందు గోదావరీ ఖండమే లేదుకదా ? లేదు నిజమే. ఉన్నదని కాశీఖండము నందాయనయే వ్రాసిపెట్టినాడు కూడ కదా ? అయినచో ఆయన కాయనయే ప్రమాణమా ? కాదన్నచో ఆయనను అనృతవాది అన్నట్లే యగునుకదా ? అందుకనియేకదా ఈ సమస్య పుట్టినది !

# II

భీమేశ్వరపురాణమును రచించునాటికి కాశీఖండమును తెనుగు చేసియుండకపోయినను శ్రీనాథునకు దానిమీద బుద్ధి పనిచేయుచున్నది. కాన ప్రకటీకృతముకాలేదుకాని అంతయో కొంతయో అప్పటికే కాశీఖండమును తెనుగుచేసి పెట్టుకొనియుండవచ్చును కాశీఖండమునుబట్టియే భీమఖండము నిర్మింపబడినది. ఒక విధముగా కాశీఖండము యొక్క కొనసాగింపే భీమఖండము. అగుచో భీమఖండము వ్రాసెడు వానికి కాశీఖండము మనస్సులో లేదని చెప్పుటకు వీలలేదు. కాశీఖండముయొక్క ముందు వెనుకలను ముడివేసి సొగదీయుగా భీమేశ్వర పురాణ ప్రబంధము రూపుగట్టుకొన్నది. కాశీఖండమునకు ముందు అగస్త్యుడు చివర వ్యాసుడు. విధి వ్యాసాగస్త్యులను కాశీనగరమునుంచి వెలువరించినది క్రియ ఉభయసామాన్యమై వర్తించుటచేత వారినొక ముడికి లాగి కర్మఫలానుభవమును కల్గించినది. క్రియ కాశీఖండమునందున్నది. ఫలానుభవ పరిణామమంతయు భీమఖండము నందున్నది. వీరు ఫలాశ్రయ భూతులని కావ్యము మొదలు పెట్టిన వానికి తాత్పర్యము తెలియకపోవుటయెట్లు ? అందువలన శ్రీనాథుడు కాశీఖండము తెలిసి భీమేశ్వర పురాణము రచించినాడు. ఎందుకనగా ఆ తెలివినుండియే ఇది పుట్టి తీరవలయును గనుక. ఈ భీమఖండమునకు శ్రీనాథుడు వేసిన పునాది తన కాశీఖండ పరిజ్ఞానము. వ్యాసాగస్త్యులు లేనిచో భీమఖండములేదు. భీమఖండమున కక్కరపడిన వ్యాసాగస్త్యులు కాశీఖండమునందే కలరు వారినిపట్టుకొనుట వల్లనే కాశీఖండమునకు దీటుగా భీమఖండము రచింపబడుటకువీలైనది దక్షారామము దక్షిణ కాశియని వ్యాసాగస్త్యులు అన్నారు గనుక అయినది. వారూరక యందురా ? వారంతటవారు అనవలసినట్టి తగిన పరిస్థితులను శ్రీనాథుడు తన స్వస్థాన వేషభాషాభిమానమునకు దీటైన తన మహాబుద్ధి వైభవముచేత కల్పించినాడు.

కాశీనగరము వెలువడిన అగస్త్యుడు వింధ్య దాటిన తరువాత దక్షిణ భారతమున ఫలానాచోట ఉండవలయునని కాశీఖండము చెప్పదు. అగస్త్యుని శ్రీనాథుడిక్కడ పట్టుకొన్నాడు. కాశీనగర వియోగ దుఃఖమును అగస్త్యుడనుభవించి దానిని కాశీఖండము వర్ణించినది. అంతగా కాశీనివాసము నభిలషించినవాడు దక్షిణాపథమునకు వచ్చి ఇక తిరిగి వెళ్ళలేదు ఇంతవరకే కాశీఖండము చెప్పుచున్నది. దక్షిణ భారతమునందు అగస్త్యుని ఉనికి ఎట్టిది ? ఆయన కాశీ వియోగ దుఃఖముతోనే యున్నడా ? ఉన్నచో ఎంత కాలమున్నది ? దానితో ఆయన ఏమైనాడు ? లేనిచో అది ఎట్లుపశమించినది ? అని ఈ విధముగా కాశీఖండము చెప్పని దానిని గురించి శ్రీనాథుడాలోచించినాడు.

వ్యాసుని విషయము కూడ దాదాపిట్టే యున్నది. కాశినుండి పంపించి వేయవలసినదని విశ్వేశ్వరుడన్న పూర్వకాజ్ఞాపించినాడు. వ్యాసుడు కాశీనుండి వెళ్ళబడగా అమ్మవారికి దయపుట్టి ఆమెయే విశ్వేశ్వరుని అనుమతిమీద వానిని కరుణించినది ఆమె దయవలన కాశీనగరము వెలువడియుండి భూతతిథులయందు మాత్రము నగర ప్రవేశము చేయుటకు వ్యాసున కనుమతి లభించినది. ఇంతవరకే కాశీఖండము చెప్పుచున్నది. కాశీనగరము వెలువడి వ్యాసుడెక్కడ ఉన్నాడు ? కాశీనగరమునుండి బహిష్కరింపబడిన యవమాన దుఃఖము ఆయనకుపశమించినదా లేదా? అదియెట్లు ? భూతతిథులయందు ప్రవేశించుటకు వాని కనుమతి నిచ్చుటయేనా అమ్మవారు చేయగలిగినది? అసలను వ్యాసులవారిమీద స్వామికింత కోపమేమి ? తాను పెట్టిన పరీక్షలో ఆయన నెగ్గలేకపోయినాడంతేకదా ? వ్యాసునకు కోపము వచ్చునట్లుచేసి, వచ్చినదని తాను కోపించుట చమత్కారము వరకైనచో బాగుండును గాని అంతకుమించినచో భరించుట కష్టముకదా? కాశీఖండము కష్టమే ఇష్టమన్నట్లున్నది. అది శ్రీకాశీవిశ్వేశ్వర క్షేత్రదేవతా మాహాత్మ్యమును దీపింపజేయుచున్నట్లు లేదే! విశ్వేశ్వరుని నిగ్రహశక్తిని చూపించుటయే కాశీఖండము తాత్పర్యమా ? దాని తాత్పర్యమక్కడ సక్రమముగా వ్యక్తమగుటలేదు. మరి దీనికి మార్గమేమి అని ఈ విధముగా కాశీఖండము చెప్పని దానిని గురించి శ్రీనాథుడాలోచించినాడు. లోలోపల అదే ధ్యానముగా ఇట్లాలో

చించుచు నాలోచించుమను అగస్త్యుని కి పుమాడగా ఆయనసభార్యుడు కొలా పురము దాక వచ్చి పోవుట కనిపించినది. ఇంతవంకు సంస్కృత కాశీఖండము శక భీమేశ్వర పురాణము

అగస్త్యునకు దక్షిణ కాశీనివాసమేర్పాటుచేసిన చో కాశి వియోగ దుఃఖోప శమనమును పొంది దక్షిణాదిన ఆయన ఉండవచ్చును. ఆయన కెట్లును కాశీనగిరమునకు పోవు అవకాశము లేదు గనుక దక్షిణ కాశియగు దక్షారామమును చూపించినచో ఆయన దీని కాశీ లక్షణముల నింకను పెంచ గలడు దక్షారామక్షేత్రమాహాత్మ్య మిను మిక్కిలి యగును అందువలన దక్షారామమునకు ముందు లోపాము దాసహితుడు అగస్త్యుడు రావలయును. ఆయన ఎప్పుడో వచ్చినాడు

వ్యాసుని అన్నపూర్ణా మహాదేవి అను గహించినటు న్న దానిని శ్రీనాథుడు భావించినాడు ఆమెయే వ్యాసులవారికి ఆ కిటుకు చెప్పినది. (భీమేశ్వర 2-156)

వేఱవకుమో కుమార పదివేల విధంబులనైన విన్ను నే
మఱవ మఖేడకుం జనుట మాని సుఖంబున దక్షవాటికన్
దుఱగలిగొన్న సమ్మదముతో గమనింపుము భీమనాయకుం
డఱగొఱలేనివేల్పు నిఖిలాభ్యుదయ బులు నీకునయ్యెడున్.

కాశీఖండమునుచూచి ఆలోచించిన దానికి ఫలితముగా భీమేశ్వర పురాణమునకు పునాది భావముగా అమ్మవారు శ్రీ నాథున కనుగ్రహించిన కీలకమది దానిని వినియోగమునకు మల్లింపగా శ్రీ భీమేశ్వర పురాణాంధ్రభాషా పబంధము సిద్ధించినది. కాశీఖండమునుండి భీమఖండము వచ్చినదనగా ఇట్లు వచ్చినది.

శ్రీనాథుడు ముందు ఉత్పాద్యమును చూపించి ఉత్పాదకముమ గూర్చి ప్రసంగవశమున చెప్పిన దానినిబటి బెండ పూడన్నయ మంత్రిగారి నేలిన వీరభద్రేశ్వర ప్రభువు దానిని తనపేర వెలయింప వలసినదిగా కోరియుండును. అప్పుడు శ్రీనాథుడు తెనుగుజేసి కాశీ ఖండమును బయటపెట్టియుండును. అందువలన శ్రీనాథుని కృతులవరుసలో భీమఖండము ముందై కాశీఖండము తరువాతైనది.

కాశీఖండముత్పాదకము. భీమఖండముత్పాద్యము. అయినచో గోదావరీఖండమునకు దీనితో ఏమి సంబంధము? ఏమియు నులేదు అసలు స్కాంద పురాణములో గోదావరీఖండము లేదు లేనిది ని మనముట చెప్పుటకును శ్రీనాథని స్వస్థాన వేషభాషాభిమానమే కారణము కావలయును శ్రీ కాశీవిశ్వేశ్వర వియున్నదీ మహాత్మ్య సరియుతమైన కాశీఖండము స్కాంద పురాణమునందున్నది. శ్రీమద్దక్షారామ - భీమేశ్వర మహాత్మ్య సంయుతమైన భీమేశ్వర పురాణముపంచా త్ఖండమండితమైన స్కాందమునందేటుండవలయును గనుక గోదావరీ ఖండముగా చెప్పబడినది దక్షిణకాశీ. కాశితో సమానము భీమేశ్వరుడు విశ్వేశ్వరునితో సమానము గోదావరి గంగతో సమానము. గోదావరీఖండము కాశీఖండముతో సమానము ఒక్క గోదావరీఖండము తప్ప మిగిలినవన్నియు నున్నవి. గోదావరీ ఖండము నకు బదులుగా భీమేశ్వర పురాణ పబంధమున్నది గోదావరీఖండ మున్నను అది స్కాంద పురాణమున సంస్కృత పయుండుండును గనుక స్వస్థాన వేషభాషా మానముగల రసపలుబు లయిన తెలుగు ధీమంతులు దానినెటును తొలగబెట్టి ఆంధ్ర భాషా ప్రబంధమునే స్వీకరించెదరు. ఆంధ్రభాషాభమానులకు గోదావరీ ఖండమున్న దానికిని లేనిదానికిని భేదములేదు సంస్కృతమూలాను లేక తెలుగులో ఏమియు నుండరాదనెడు పట్టుదల రాజమహేంద్రవరము విద్వాంసులకు గోదావరీ ఖండము చూపింపబడినది దానికే భీమఖండమనియు పేరు. సంస్కృత భీమఖండమున కెవరు కర్తలు? శ్రీనాథుడే కావచ్చును కాదని పరిశోధక విద్వాంసు లనుచున్నారు. అసలు వాడెవడో తెలియనప్పుడు ఆ అనామకుని పట్టుకొని వేలాడుట కంటె అది తెలియవచ్చెడునంత వరకు శ్రీనాథుడే తన భీమేశ్వర పురాణ ప్రబంధమును సంస్కృతీకరించుకొనియుండి యుండవచ్చుననుచు ఊరకుండవచ్చును

అందువలన శ్రీనాథుడన్యత మాడినది లేదు. ఉన్నను అది ఆయన విషయమున పాపహేతువుకాదు. దాని విషయమింకను లోతుగా నాలోచింపవలయును.

# III

భీమేశ్వర పురాణావతారికలో ఈ పద్యములును కలవు.

వెస వసుధాస్థలంబున కవీంద్రులు కొందఱు శేముషీముషీ
రసము మనఃకటాహ కుహరంబులనించి కలంచి జిహ్వాక
కిసలయ తూలికంగొని లిఖింతురు కబ్బము లెప్పుగా మష
మసవముతో నిజాశన వియత్తల తాళపలాశ రేఖలన్.

బోధమల్పంబు గర్వమభ్యున్నతంబు
శాంతి నిప్పచ్చరంబు మచ్చరము ఘనము
కూపమండూకములు బోలె కొంచె మెఱిగి
పండితం మన్యులైన వైతండికులకు.

ప్రౌఢి పరికింప సంస్కృత భాషయందు
పలుకు నుడికారమున ఆంధ్రభాషయందు
ఎవ్వరేమన్న నండ్రుగాకేల కొఱత
నా కవిత్వంబు నిజము కర్ణాట భాష.

నవ మరుత్తు చరిత్రంబు నైషధంబు
సప్తశతి పండితారాధ్య చరితమనగ
కావ్యములు పెక్కు చెప్పియు కాంక్షవనక
వెడియును కావ్యమొకటి గావింప దలచి.

రస ప్రసవమైన ప్రతిభాలక్షణముచేత మనసును మధించి కావ్య రసము ౖ వాఙ్మయముచేసి జిహ్వాగ్రమునకు తెచ్చుచు మహా కవులు కావ్యములు రచింతురు అది వారికి ఒక వ్యసనము. కావ్య రచన వ్యసనమైనవారు మహాకవులలో నింకను మహాకవులు కావచ్చును అటివారెప్పుడును కొంచఱుగానే యుందురు. శ్రేయో మార్గమునుండి తప్పించువానిని గదా వ్యసనములందురు? మరి శ్రీనాథుడు తన కావ్యరచనమునకు దానిని చెప్పుచున్నాడేమి? ఆయనకు దాని వాచ్యార్థమునందు వివక్షలేదు అందువలన అది తిరస్కరింపబడవలసినదే. వ్యసనము మనుష్యుల నెంతగా వశము చేసికొనగలదో, కావ్యరచనా వ్యాపార మింతకుమించి శ్రీనాథుని వశము చేసికొన్నది. వశము చేసికొనగలుగుటలో కావ్యరచనా వ్యాపారమునకింత సామర్థ్యమున్నదని చెప్పుటకు వ్యసన ముపమానముగా అర్థము కావలయునన్న ఉద్దేశ్యముతోడనే ఆ పద్యములు వ్రాయబడినవి.

అయినచో ఆ కొందరు గాక మిగిలిన కవులు కావ్యములనట్లు గాక ఎటు వ్రాయుదురు? శేషముషిలేదు. పట్టి సిరామసి యున్నది మనస్సులేదు. పట్టి కటుహకుహరము సిరాబుడ్డి యున్నది. నించుటయున్నది. కలంచుటకూడ యుండవచ్చును. జిహ్వకలేదు తూలికయున్నది. వ్యసనము దాని వాచ్యార్థముతోనుండిన ఉండవచ్చును. నిజాననములులేవు. పుష్కలముగా తాటియాకులున్నవి. లేని వాటినివదలి ఉన్నవాటిని పట్టుకొనియే కటుహకుహరములో మషీ రసమును పోసి తూలికనందు ముంచి, ఏలాగైనను కావ్యములు వ్రాసి పారవేయవలయునన్న వ్యసనముతో, తాటియాకులమీద వ్రాయుచున్నారు. ఇట్టి బాహ్య సామగ్రీ సమగ్రత్వముతోనే చాలమంది కవులు కావ్యములు చెప్పుచున్నారు. బాహ్యదృష్టిని ఆభ్యంతరముగా మలచుకొన్నవారు మహాకవులు. అంతటి వారైదారుగురకంటె ఎట్లును ఎక్కువుండరు.

అయినచో శ్రీనాథు డింతటి అభ్యంతర దృష్టితో ఈ కావ్యమును రచించినాడా? నిస్సందేహముగా రచించినాడు. శ్రీనాథుని శేముషియందు నన్నయ్యగారి గాఢప్రతిభ యున్నది. ఇతివృత్తమును ఘట్టమునుండి ఘట మునకుగా లంఘింపజేయుచు కథన శిల్పము సుప్రయోగించెడు ప్రతిభను మహాభారతమునందు ప్రగాఢ లక్షణ లక్షితమై యుండుటను చూచి దానిని తానలవాటు చేసియున్నాడు గనుక ఇప్పుడు ఈ భీమేశ్వర పురాణమును రచించుటలో దాని అక్కరయున్నది గనుక నన్నయ్యగారిని స్మరించుచున్నట్లా ప్రతిభను స్మరించి దాని నావేశింపజేసికొనినాడు. ఆ యావేశింపజేసికొన్న క్రమమునే ఆ పద్యమునందు చెప్పినాడు

భీమేశ్వర పురాణమునందలి ఇతివృత్తమును తాను తన మనస్సుచేత సంకల్పించి ప్రతిభాలక్షణ లక్షితమైన తన మోహ శబలితముగాని బుద్ధి వైభవముచేత దానిని ఘట మునమీద పరచుకొనుచు - దాని నాంధ్రభాషా ప్రబంధముగా జిహ్వాగ్రముద్వారా శ్రీనాథుడు వెలయించినాడు అట్లు కల్పించియైనను భీమేశ్వర పురాణమును రచింపవలసిన అక్కరయేమి? ఏమియునులేదు. వ్యసనమే కారణమని ఆయనయే చెప్పుకొనెను. ఆ వ్యసనముయొక్క శ్రేయోలక్షణము ఆయనకున్న స్వస్థాన వేషభాషాభిమానమునందున్నది. శేషముషి - మనస్సు జిహ్వక—ఇది పరావాక్కుయొక్క ఆవిష్కార మార్గము. శ్రీనాథుడు నన్నయ్యగారి గాఢప్రతిభను వైఖరీముఖముగా తన నావేశింపచేసికొన్నాడు. అనగా పరావాగ్దేవతయొక్క మేలుకొనుటను సాధించుకొనాడని యర్థము. పరావాగ్దేవి తన ఆంధ్రమయా రూపమును వైఖరీదశయందు శ్రీనాథునకు ప్రసన్నముచేసినది. భీమేశ్వర పురాణము ఆంధ్రభాషా ప్రబంధముగా సిద్ధించినది

బోధమల్పమిత్యాదిగాగల పద్యము వాగ్దేవతా ప్రసన్నోల్లక్షణము యొక్క బోధ లేని కావ్యరచనకు—సిరా సిరాబుడ్డి తూలిక తాటియాకులు - ఇవేకదా కావలసినవనుకొని ప్రవర్తించెడు పండితం

మ్మన్యుల స్వభావమును చెప్పుచున్నది. కావ్యములకు ఇతివృత్తములు కవుల బుద్ధివైభవమునుండి ఆవిష్కృతములైనవన్న నిశ్చయ జ్ఞానము లేకపోవుటయే అల్పబోధము. ఏభాషయందైనను కవులు కవులే. సంస్కృత భాషాకవుల బుద్ధివైభవమునుండి మాత్రమే ఇతివృత్తములు పుట్టవలయునని యెక్కడ యున్నది? ఆంధ్రభాషా కవుల బుద్ధివైభవమునుండి కూడ పుట్టవచ్చును. ఆ తెలివియుండ వలయునుకాని అది ఏ భాషయైననేమి?—అని ఈ విధముగా గట్టి ఆలోచనచేసి స్వస్థానవేషభాషాభిమానముతో ఒక నిశ్చయమునకువచ్చి ప్రవర్తించెడు దమ్ములేని విద్వాంసులందరును పండితంమన్యులు పండితంమన్యులనగా ఎఱుక చాలిన బుద్ధివైభవములేని శబ్దార్థ వేత్తలని యర్థము కనుకనే వారి బోధమల్పమనుట. తన బుద్ధి వైభవమునుండి కల్పించి చెప్పిన ఇతివృత్తముగల భీమేశ్వర పురాణమును కొంచెమెఱిగిన పండితంమన్యులు మాత్సర్యబుద్ధితోనే చూడగలరని శ్రీనాథునకు తెలియును. వారింకొక విధముగా చూడలేరుగదా—అందుకని. ఈ ఇతివృత్తము మనము కల్పించినదికాదు-సంస్కృతముననే యున్నదన్నచో ఎఱుక సమగ్రము కాని పండితంమన్యులు సరే లెమ్మనుకొందురు. అట్లనువారి అల్పబోధము నాధారము చేసికొని స్కాందపురాణమున గోదావరీ ఖండము శ్రీనాథుడు కల్పించియుండునా? బోధమల్పమైనవారికి స్కాందపురాణమంతు బట్టినదా? అయినను కొంచె మెఱిగినవారు కనుక కూపమండూకములవలె బెక బెక లాడుదురు. ఆ విధముగా గోదావరీఖండ భీమేశ్వర పురాణ సంస్కృతాంధ్ర గ్రంథముల సంబంధము పండితంమన్యుల బెకబెకల వలన ఒక చిన్న సమస్యగా గాలిలో వ్యాపించినది లోకులు కాకులుగదా!

నికటముననుండి ఇత్యాది పద్యము కాకులను చెప్పుచున్నది. రాయంచ కాకులకు అనుకూలముకాదు ప్రతికూలముకాదు అది తమ [illegible]టిది మాత్రముకాదు. అంతే దానికని అవి రాయంచ చుట్టు చేరి అవునన్నదియు కాదన్నదియు తెలియకుండ పెద్ద గోలచేయును. తన భీమేశ్వర పురాణమును తనను గురించి లోకు పెద్ద గందరగోళము చేయుచున్నారు. తానేమి చేయవలయును? ఓర్పుకొనగలిగి నంతవరకును ఓర్చుకొని యుండుట—సైపరానప్పుడు తొలగి అక్కడ నుండి ఎక్కడికైనను పోవుట—ఇందులో చేయగలిగినది చేయవలయును.

ప్రౌఢి బరికింప-ఇత్యాది పద్యమునందు లోకము చేయుచున్న గందరగోళముయొక్క సారాంశమును చెప్పి శ్రీనాథుడు దానిమీద తన యభిప్రాయమును చెప్పుచున్నాడు.

(సశేషము)



# ప్రాకృత సాహిత్యంలో సామాన్య మానవుడు

శ్రీ తిరుమల రామచంద్ర

*(గత సంచిక తరువాయి)*

గాథాసప్తశతిలో కొంతకు కొంతైనా తెలుగు గడ్డపై వెలసి పుట్టిందని పండితులు విశ్వసించడంవల్ల దీనిలోని సామాన్య జీవిత విషయాలు వివరంగా చెప్పవలసి వచ్చింది. దీనిలోని తెలుగు తెలుగు పదాలను గురించి 25 సంవత్సరాల కిందటే భారతిలో వ్రాశాను.[8]

## వజ్జాలగ్గంలో

వజ్జాలగ్గంకూడ గాథాసప్తశతివలె ముక్తకాల సంకలనమే. దీని సంకలనకర్త జయవల్లభుడనే శ్వేతాంబర జైనముని. ఇతడు 8 వ శతాబ్దం ప్రారంభంలో ఉన్నవాడు. తను ధర్మార్థ కామాలనే త్రివర్గం గురించిన సుభాషితాలను సంకలనం చేశానని ఇతడు చెప్పుకొన్నాడు.

"సువ్వన్ను వయణ పంకయ
ణివాసిణిం పణమిఊణ సుయదేవిం,
ధమ్మాఇ తివగ్గ జుయం
సుఅయాణ సుహాసి అం వోచ్ఛం" ప–1

(సర్వజ్ఞ వదన పంకజ
నివాసినీం ప్రణమ్య శ్రుతదేవీం,
ధర్మాది త్రివర్గ యుక్తం
సుజనానాం సుభాషితం వక్ష్యామి.)

వివిధ కవుల గాథలలో మేలిమిని గ్రహించి జయవల్లభమనే వజ్జాలగ్గం విధిపూర్వకంగా రచించాను–కూర్చాను–అన్నాడు.[9]

వజ్జా అంటె పద్ధతి. వాటి లగ్గం–సంకలనం, గుచ్ఛం. ఒక ప్రస్తావంలో చెప్పే గాథల పద్ధతిని వజ్జా–వ్రజ్యా అన్నానని తెలుపుకొన్నాడు,[10] ఇతడు ప్రాకృతం గురించి గొప్పగా చెప్పుకొన్నాడు. లలిత మధురాక్షరమయినది ప్రాకృత కావ్యం. అది స్త్రీలకు ఇష్టమయింది. శృంగార రసయుతం. అలాటిది ఉండగా సంస్కృతం ఎవరు చదువుతారు ?–అని ఇతని ప్రశ్న.

"లలిఏ మహురక్ఖర ఏ
జువఈ జణ వల్లహే ససింగారే
సంతే పా ఇఅ కవ్వే
కో సక్కఇ సక్కఅం పఢిఉం. –29

గాథలరసం తెలియని మోటువాళ్ళు దానిని ఈకకు ఈక, తోకకు తోక లాగి పాడుచేస్తారని, పాలు పితుకడం సరిగా తెలియని వారు, ఆవులను బాధపెట్టినట్టు అని, "ఓ గాథా, నిన్ను మోటు మనుష్యులు అడ దిడంగా చదువుతారు, కర్ణకఠోరంగా, ఎక్కడ బడితే అక్కడ విరుస్తారు, చెరుకుతినడం తెలియని మోటువాళ్ళు చెరుకు నమిలినట్టు !" అని ఇతడు వాపోతాడు."

వజ్జాలగ్గం భర్తృహరి సుభాషిత పద్ధతిలో సంకలనం చేసినట్టిది. దీనిలో 96 వగ్గాలలో దాదాపు వేయి గాథలున్నాయి. సామాన్యజనుడే ఈ కవి లక్ష్యమూను. కనుక ఇతడు ఐశ్వర్యవంతుల్ని, ఇతరులను స్వేచ్ఛగా వర్ణించాడు. దరిద్రుడు ఇతని దృష్టిలో సిద్ధులందరికన్నా మహా సిద్ధుడు.

"దీసంతి జోయసిద్ధా
అంజణ సిద్ధా వి కేవి దీసంతి,
దారిద్ద జోయసిద్ధం
మం తె లో అన్నేసంత" 141

(దృశ్యంతే యోగసిద్ధాః
అంజన సిద్ధా అపి కేచన దృశ్యంతే,
దారిద్ర్యయోగ సిద్ధం
మాం తే లోకా న ప్రేక్షంతే.)

...ద్రుణ్ణి ఎవ్వరూ పాటించరు అనడాన్ని కవి ప్రకారాంతరంగా చెప్పాడు. ఒక దరిద్రుడు ఇలా అనుకుంటాడు యోగసిద్ధులు కనబడుతారు. అంజన సిద్ధులూ కనబడుతారు. నాబోటి దారిద్ర్య యోగసిద్ధులు ఎప్పుడూ, ఎవ్వరికీ కనిపించరు—అని.

ఇతడు రాజసేవకులు దంభధర్మాంకులు, వస్త్ర వ్యాపారులు, పల్లెటూరిలో తెలివితేటలవారు, పక్షి వాళ్ళు, వైద్యులు, జ్యోతిష్కులు, మొదలయినవారి మనస్తత్త్వాలను బాగా చిత్రించాడు. రాజసేవకునికి ఏదైనా సౌఖ్యం కాకతాళీయంగా సంభవిస్తే, అది క్షపణకుని స్వర్గారోహణం వలె, ఎన్నో కష్టాల తర్వాత మరణానంతరం సంభవించవచ్చునంటాడు.

"జఇ నామ కహవి సోక్ఖం
హొజ్జ తులగ్గేణ సేవఅజణస్స,
తం ఖవణఅ సగ్గారో
హణం వ విగ్గోవఅ సవిహిం." —153

(యది నామ కథమపి సౌఖ్యం
భవతి తులాగ్రేణ సేవకజనస్య,
తత్ క్షపణక స్వర్గారోహణ
మివ వ్యాకుల భావశతైః.)

క్షపణకుడు, సన్యాసికి సుఖం కలిగేదెప్పుడు? మరణించిన తర్వాత; అతని గొప్పదనం గ్రహించిన జనం అతనికి విమానంకట్టి మోసుకొనిపోతారు, వాద్యాలు మోగుతుండగా; దానాలు ఇస్తారు. అతనిపేర ఇలా అంత్య సంస్కారం కోసం తీసుకువెళ్ళుతారు. ఇలాగే రాజసేవకునికి కాకతాళీయంగా ఏదైనా సుఖం కలిగితే, అది మరణానంతరమే. జీవితకాలంలో సుఖం కలుగదు.

ఒక సేవకుడు ఇలా అనుకుంటాడు..."మంచి పొదుగులు గల మూడు ఆవులు, నాలుగు మంచి ఎద్దులు, చేతినిండా వరికంకులు ఫుంటేచాలు. ఓ సేవాధర్మమా, నీవు ఎక్కడున్నా సుఖంగా వుండు"

"తంబాఉ తిన్ని సుపఓహరా ఉ
చత్తారి ఏక్కల ఎఇల్లా,
నిప్పన్నా సాలయ మంజరీ ఉ
సేవా సుహం కుణఉ." —160

(గావ స్తిస్రః సుపయోధరాః
చత్వారః సమర్థబలీవర్దాః
నిష్పన్నా శాలవ మంజర్యః
సేవా సుఖం కరోతు)

గ్రామాలలో చతురులు చాలామంది ఉంటారు. వారిని గురించి, వారి ఎత్తులనుగురించి ఇతడు చాల విపులంగా వివేచన చేశాడు. ఒకతె ఒక అమాయిక రాలిని హెచ్చరిస్తుంది. "అమ్మాయి నీవు గ్రామాలలోని భేకులు-చతురులు బహుకూట కపట నిపుణులు. వారి చేతుల్లో పడినవారికి స్వప్నంలోను సుఖంలేదు. వారికి ఆరవ జ్ఞానంవుంది. ఆ ఆరవ చూపులో పడినవానికి సుఖం వుండదు."[12] నగరమందే మేడలతో, మిద్దెలతో, ప్రాకారాలతో, శిఖరాలతో వుండేదికాదు. చతురులున్న గ్రామమూ నగరమవుతుంది.[13]

లావణ్యాన్నిగురించి ప్రాకృతకవి ఊహలు గొప్పవి. అది శరీర సౌందర్యానికి, అంగాంగ సౌష్ఠవానికి మించినది; వాటినిండా, వాటిపైనా పారాడేది. అలాటి లావణ్యాన్ని ఒక సుందరిలో తొణికిసలాడే దాన్ని చూచాడు కవి. అతనికి నిరంతరం తన ఎదుట సంచులలో ధాన్యమో, వత్తో కూరిపెట్టి సర్దుతున్న పరిస్థితి జ్ఞాపకం వచ్చింది కాబోలు గొప్పగా గాథలో నింపాడు, కూరిపెట్టాడు: విధి ఒక తన్వంగిని లావణ్యంతో కూరికూరి నింపాడట. పైనుంచి నొక్కి నొక్కి కూరిన చేతుల గుర్తులే వంకులజుట్టు సుమా!

"తహ చంపిఊణ భరి ఆ
విహిణా లావణ్ణ ఏత తణు అంగీ
జహ సే చిహురతరంగా
అంగులి మగ్గ వ్వ దీసంతి." 314

(తథా విపీడ్య భృతా
విధినా లావణ్యేన తన్వంగీ,
యథా అస్యాః చికురతరంగా
అంగులీమార్గా ఇవ దృశ్యంతే.)

ప్రాకృతకవి ప్రేమ సిద్ధాంతం అపూర్వమైంది. దాని ఉత్పత్తి పరిణామాలను అతడు ఊహించినట్లు రాజరంజకకవులు ఎన్ని జన్మ లెత్తినా ఊహించలేరని నా విశ్వాసం. "ప్రేమ అనేది అనాది పర మార్థ ప్రకటనం, మోహానురాగ జనకం, మధుమథనునివలె బహు రూపమయింది." అని అతని సిద్ధాంతం. ఈ ప్రేమ ఆలాపం, ఉల్లాపం (సంభాషణ), కలిసి ఉండడం కుతూహలం, ప్రియ గుణ గణం అనే మెట్లగుండా పైకి ఎక్కుతుంది [14] ఇంతగా వటవృక్షం వలె వ్యాపించిన ప్రేమ కూలిపోతే, కూలిపోయిన మర్రిచెట్టు వేళ్లు కూడ కనిపించనట్టు. కొంచెమైనా సదు లేకుండా కూలిపోతుంది. [15] ఈ ప్రేమను ప్రాకృతకవి దానిమ్మకాయ పండే పద్ధతితో పోల్చి తన నిత్య వ్యవసాయ విజ్ఞానాన్ని ప్రదర్శించాడు.

"దాడిమఫలం వ్వ పెమ్మం
ఎక్కేపక్కేవ్వ హోఇ సకసాయం,
జావ న బీఓ రజ్జఇ
తా కిం మహురత్తణం కుణఇ." 334

(దాడిమఫల మివ ప్రేమ
ఏకస్మిన్ పక్షే సకషాయం,
యావన్న ద్వితీయో రజ్యతే
తావత్కిం మధురత్వం కరోతి.)

దానిమ్మపండు తక్కిన పళ్లవంటిదికాదు. తక్కిన పళ్లు ఒకే సమయంలో అంతటాపండి తియ్యనవుతాయి. దానిమ్మపండు క్రమంగా పండుతూవస్తుంది. గింజ ఎర్రబడేవరకు పూర్తిగాపండదు. ఒక పక్కన ఒగరుగా వుంటుంది. ప్రేమకూడా ఏకపక్షమయితే, సకషాయమయితే, ఒకే పక్కన ప్రేమ వుండి మరొక పక్కన బింకం వుంటే, ఒగరుగా వుంటుంది. రెండవ పక్షమూ రాగరంజితమయ్యే వరకు—అంటే ఇద్దరూ ప్రేమమయులయ్యేవరకు మాధుర్యం ఏర్పడదు. బీఓ అనే మాటను శ్లేషతోవాడి కవి ఈ మాధుర్యం తెచ్చాడు. బీఓ అనే మాటకు బీజమని, ద్వితీయం, రెండవ అని శ్లేషార్థం. గింజ ఎర్రబడేవరకు, రెండవపక్షం ఈ రాగరంజితమయ్యేవరకు అని అర్థం. ప్రేమ అనేది ఎప్పుడూ ఏకపక్షం కాగూడదు. ఉభయపక్షంగా వుండాలి.

బింకం వున్నచోట ప్రేమ వుండదు. ప్రేమ వున్నచోట బింకం మాన వుండరాదు; ఇవి రెండూ పరస్పరం విరుద్ధమైనవి. ఒక కట్టు కంబానికి రెండు ఏనుగులను ఎవరైనా కట్టివేస్తారా? రెండూ ఒకచోట వుండలేవు.

"జఇ మాణో కీస పిఓ
అహవ పిఓ కీస కీరఏ మాణో,
మాణిణి దోవి గఇందా
ఎక్కక్కంభే న బజ్ఝంతి."— 355

దీనినే కబీర్ మరొక విధంగా అన్నాడు: ప్రేమరసం పాన చేయా లంటే మానం—అహంకారంతోనూ వుంటే, కుదరదు. ఒక ఒరలో రెండుకత్తులు ఇమడవోయ్! ఇలాటిది ఎవరూ వినలేదు; కనలేదు."

పియా చాహై ప్రేమరస
రాఖా చాహై మాన
ఏకమ్యానమేం దో ఖడగ
దేఖా సునా న కాన."

"ప్రేమించడం అనేది పెట్టుకోకు ఎవరినీ ప్రేమించకు. నీవు నిన్ను ఎవరికీ సమర్పించుకోకు. ఎవరినీ నీవాడుగా చేసుకోకు. అంతవరకు సుఖంగా ఉంటావు. ఎప్పుడైతే నీవు ప్రియ వ్యక్తికోసం బంధం పెట్టుకున్నావో, నిన్ను నీవు దుఃఖానికి సమర్పించుకొన్నట్టే సుమా!" అని ఒక అనుభవజ్ఞురాలు ఒక నవ యువతికి సలహా యిస్తుంది.

నేడు పల్లెటూరి వారికి బూతులన్నా, సెక్సు విషయాలన్నా ఎలాటి సంకోచమూ లేనట్టే నాడూ ప్రాకృత కవులకూలేదు. అందు వల్లనే వజ్జాలగ్గకారుడు ఒక నవ దంపతులు వివిధకరణాలతో రాత్రంతా గడపడం చూచిన దీపం మూగై అయిపోయింది లెక్క పెట్టక అలాగే చూస్తూ నిలబడి పోయిందన్నాడు. వాళ్లిద్దరూ అలా గడపగాలేని సిగ్గు అతనికెందుకు? దీపానికెందుకు?

"దట్ఠూణ తరుణ సురఅం
వివిహ పలోట్టంత కరణసోహిల్లం,
దీఓ వి తగ్గయ మణో
గఅం వి తెల్లం న లక్ఖేఇ." 319

(దృష్ట్వా తరుణ సురతం
వివిధ (వలురత్ కరణ సహితం,
దీపోపి తద్గతమనాః
గతం మపితైలం న లక్షయతి.)

బూతుధ్వనియిచ్చె వర్ణోక్తులు నేడూ మహా కార్మికులు పనిచేసే ప్రాంతాలలో వినవచ్చు. ఇలాటి గాథలు వడ్రవాళ్లను, జ్యోతిష్కులను, లేఖకులను గురించినవి చాల ఉన్నాయి. వైద్యులను గురించినవీ వున్నాయి.

"చూచావా, ఉప్పరయ్య గట్టిగా గుద్దలితో పొడిచాడు. బావి నీటితో నిండిపోయింది. నీరు బుస్సున పైకి చిమ్మింది. అయినా, ఉప్పరయ్య వదలడంలేదు." అంటుంది ఒక యువతి.

"నిద్దయ కుద్దాలయ మజ్ఝ
బహులచ్ఛలంత జలసోత్తం,
ఉదో లద్దసవురిశో
భరి అం వి న మేల ఏ వాసిం" ౭౫8

(నిర్దయ కుద్దాలక మధ్య
బహుళోచ్ఛల జ్జల స్రోతసం,
ఖనకో లబ్ధ స్పర్శో
భృతా మపి న త్యజతి వాసీం.)

రాజరంజక కవులకు ముక్తారత్న భరణ వెలిగాలు, పెలిచేకాంటు రాల ఆపణాలు కనిపిస్తాయి గాని సాధారణమైన బట్టలంగళ్లు, వస్త్ర విక్రేతలు, కనిపించలేదు. ప్రాకృతకవి వారిని, శృంగారం బరువు కొంచెం ఎక్కువయినా, తన కవితలో చిత్రించాడు. పిలిని దోసిల—దేశికః—అన్నాడు.

"ఓయ్! బట్టలంగడి మనిషి, కొలతలు సరిగా వుండి, వెడల్పూ పొడుపూ బాగావుండి, ఉదికితే, రంగు వెలిసిపోకుండా వుండి, కట్టుకుంటే సుఖంగావుండే గుడ్డను ఇవ్వు. అలాకానిదానిని దూరంగా నర్మదాతీరంలో విసిరివేయి." అని ఒక యువతి బట్టలంగడివానితో అంటుంది. కొలతలు సరిగా వుండాలట, సుఖంగా వుండాలట.

'హంస విహాణం రుందీష'
చోడయం శిలాధోయ గయచ్ఛాయుం,
జం వసణం ణ సుహావ
ముఅ దూరం ణమ్మయాతీరే" 739

(మానవిహీనం రుంద్రీ
? ఇచోడయం శిలాధోయగయచ్ఛాయుం,
యద్ వసనం న సుఖయతి
ముంచ దూరం నర్మదాతీరే.)

ఇతడు తాటిచెట్టును గురించి చెప్పింది చూచి కబీరు ఖర్జూరపు చెట్టును గురించి చెప్పాడా అనిపిస్తుంది. "ఓ తాటిచెట్టూ ఎందుకు నీ ఎత్తు? నగం ఆకాశాన్ని అడ్డగించావు. ఆకలి దప్పి తీర్చు కుందామని పాంథులు దగ్గర చేరుతారా ఏమన్నానా? [17] కబీరు "జ్ఞానయ్యా గొప్పసాధువే, ఖర్జూరంలాగ, పిట్టవాలడానికి నీడలేదు; పండ్లు కోసుకుందామని అంటే, దూరంగా వున్నాయి; అందవు." అంటారు.

"సాధు భయా తో క్యా భయా
జైసే పేడ ఖజూర్,
పంఛీకో సాయా నహీం
ఫల లాగే అతిదూర్!"

వేశ్య బలహీనులు చారినా—సొగసుపింది రొట్టె కొంటడాదు. సొగసుపిండిరొట్టె రుచిగా వుంటుంది. అంగిట్లో అంటుకుంటుంది, మింగుడుపడదు. మింగుడుపడని ఆహారకణం లోకి పోయిన తరువాత గడబిడ చేస్తుంది. వుండి పోలిక. [18]

ముసరు వంటయింటికుందేలు అనే పదబంధం ఉంది. వంట ఇంటిలోని కుందేటికి మరణం తప్ప మరొకటి లేదు—అని దీనికి అర్థం చెప్పారు. "ఇది వంట ఇల్లు కాదు, వెంటయిల్లు. వేటకాండ్రు అడవులలో వన్యమృగాలు పడడంకోసం బోనులవంటి ఇళ్లను కట్టే వారు. దానిలో పడిన మృగానికి, ఇక విముక్తిలేదు. కుందేలు అనలే పిరికిది గనుక మరణం తథ్యం" అని శ్రీ ఆరుద్ర అన్నారు. ఈ వాదం సకారణమని చెప్పడానికి వజ్జాలగ్గం శశకవజ్జలో ఒక గాథ దొరికింది.

ఒక మహిళ ఒక చిన్నదానికి చెబుతున్నది—ఓ వెర్రి అమ్మాయి పిచ్చులతో తిరుగుతున్న నీ ప్రియుడు చతురుడైన అందగత్తెల

చేతులో పడుతాడు. స్కంధావారంలో దూరిన కుందేటివలె ఇక తప్పించుకోలేడు''. వెంట ఇంటి కుందేలు అనే నానుడి దీనివల్లనే వచ్చినదనుకుంటాను.

''ఘురుఘుల్లంతో రథ్యా
ముహేసు వరమహిల యాణ హత్తేసు,
ఖందారహారి ససఓ వ్వ
పుత్తి దఇఓ న చుట్కి హిఇ.'' 625

(పరిభ్రమన్ రథ్యాముఖేషు
వర మహిళానాం హస్తేషు,
స్కంధావార హారి శశక ఇవ
పుత్రి దయితో న మోక్ష్యతే.)

స్కంధావారమంటే శిబిరం—సైనికుల శిబిరం—సైనికులశిబిరంలో పొరపాటున ఏదో రక్షణ స్థానమనుకొని కుందేలు దూరిందనుకోండి. బతుకుతుందా ? కుందేలు మాంసం చాల రుచ్యం. సైనికులు యుద్ధసమయంలో శిబిరాలుగా విడియడమే కాక రాజులు వేటకు పోయినప్పుడుకూడ, శిబిరాలు ఏర్పరచుకొనేవారు. అంటే పెద్ద వల యాకారంగా ఏర్పడేవారు. దానిలో ఒకచోట దారివుండేది.దానిలో దూరి లోపలికి మృగం రాగానే క్రమంగా బిగించి, చంపేవారు. దీనిని మనవారు వెంటఇల్లు, వేటఇల్లు అని వుంటారు. వెంట ఇల్లు క్రమంగా వంటయిల్లు అయివుంటుంది; ఉచ్చారణ వేగంతో.

పల్లెటూరివారి విశిష్టత పొడుపుకథలలోనూ ప్రజ్ఞ చూపడం. ఇవి చాల వినోదంగాను, విజ్ఞానదాయకంగాను వుంటాయి. వీటిని ఒక విధంగా ప్రహేళికలు అనవచ్చు. ఈ ప్రహేళికలు వజ్జాలగ్గంలో [14] హియాలివజ్జా అనే శీర్షికలో ఉన్నాయి. ఇవి పూర్తిగా గ్రామీణ మేథా విలసితాలు. వీటిలో విపరీతంగా శృంగారంవున్న వాటిని కాక కొన్ని ఇతని వివరిస్తాను :

''నీ ముఖం చంద్రునివలె వుంది అని నెచ్చెలులు ఒక యువతిని ప్రశంసించారు. ఆ యువతి వెంటనే తన చెక్కిలిని చేతో సవరించు కొంది. ఎందుకు ?'' దీనికి సమాధానం ఏమిటంటే, ''నీళ్ళ నా ముఖం చంద్రబింబ సదృశమంటున్నారే. నీవేమో నా ముఖాన్ని కర్పూర కేతకీ ధూళితో అలంకరించుకొన్నాను. చెంపలకు నా ప్రియుని పెదవులకు తగిలి నా కాటుక అంటలేదుగదా! అని ఆమె చెంపలు సవరించుకొంది ' అని.

''నీకు తిలకం దిద్దుతాను. రా. అని భర్త పిలిస్తే, ముద్దరాలు నవ్వి ముఖం తిప్పుకుంది. ఎందుకు ?'' తిలకం దిదు తాననే వ్యాజంతో ముద్దు పెట్టుకుంటాడని ఆమె నవ్వు.

''పరిజనం మధ్యఉన్న యువకుణ్ణి చూచింది యువతి చేతిలో వికసించివున్న పద్మాన్ని మరో చేతో మూసింది. ఎందుకు?'' అస్త మయం తర్వాత నన్ను కలుసుకోమని సంకేతం.

''వ్యాధుడు పెద మదగజేం దాన్ని ఒక్క బాణంతో చంపి, వెంటనే మడుగు దగ్గరికి వెళ్ళి బాణం కడిగి, ఆ నీళ్ళు తాగాడు. ఎందుకు ?'' విషం పూసిన బాణంతో ఏనుగును చంపాననే అను మానం కలుగకుండ నీరు త్రాగాడు అని స ధానం [18]

వజ్జాలగ్గకారుడు ఇలా అసంఖ్యాకంగా కల్పనా రత్నాలను కుమ్మరించాడు.

## సేతుబంధంలో

సేతుబంధ కావ్యం వాకాటక ప్రభువయిన ప్రవరసేనుడు రచించినది. ప్రవరసేనుడు కాళిదాస సమకాలికుడు. 5వ శతాబ్దంవాడు. ఈ సేతుబంధాన్ని దండి మహారాష్ట్రీ ప్రాకృతంలో రచితమైన మహాకావ్యంగా వర్ణించాడు. ''మహారాష్ట్రా శ్రయం భాషాం

ప్రకృష్టం ప్రాకృతం విదుః''- అని, [20]

ఈ సేతుబంధానికి రావణవహో అని, దసముహవహో అని నామాంతరాలున్నాయి. ఇది 15 ఆశ్వాసాల మహాకావ్యం. ఈ రాజకవి ప్రాకృతాన్ని విశేషంగా ఆదరించి, దీనిని ఆర్యాగీతి ఛందస్సులో రచించాడు. దీనిలో హనుమంతుడు సీతనుంచి చూడామణిని తెచ్చినప్పటినుంచి, రావణ వధానంతరం రాముడు అయోధ్యకు పోయేవరకుగల కథ ఇతివృత్తం. వానరసేన ప్రస్థానం, వానరులు సేతువును కట్టడం, యుద్ధవ్యూహాలూ అపూర్వంగా వర్ణించబడినాయి. వంతెన కట్టేప్పుడు వానరులు కొండలను, గుండ్లను అందుకోడం, గోడసర్దడం, గండ్లుపూడ్చడం వంటి కార్మికుల పనులను వివరించడంలో ప్రవరసేనుడు ప్రవరుడని నిరూపించుకొన్నాడు.

సాధారణంగా బరువులు మోసేవారు బుజాలమీద బరువు మోసుకొని ఒకచేత్తో ఆ బరువు వస్తువును పైనుంచి పట్టుకొని వెళ్ళుతారు. వంతెన కడుతున్నారు. వానరులు కొండలను ఎడమ బుజంమీద పెట్టుకొన్నారు. ఎడమ చేతిని వంచి నడుముమీద పెట్టు కొన్నారు. కుడిచేతిని ఎత్తి కొండ శిఖరం గట్టిగా పట్టుకొని మోసుకొని వస్తున్నారు.

"అంస ఠ్ఠవిఅ మహిఅరా
ఉబ్భిఅ దాహిణ కరావలంబిఅ సిహరా
ఉత్తాణ వామ కరఅల
ధరి అ ణియంబప్పసరా ణీఅత్తంతి కఈ."

(అంసస్థాపిత మహీధరాః
ఉచ్ఛ్రిత దక్షిణ కరావలంబిత శిఖరాః
ఉత్తాన వామకరతల
ధృత నితంబ ప్రసరా నివర్తంతే కపయః)

బరువులు మోసేవారిని ప్రవరసేనుడు ఎంత సూక్ష్మంగా చూచి, సహజంగా వర్ణించాడో ఈ గీతి స్పష్టం చేస్తున్నది.

నేడు గోడలు కడుతున్న తాపీ మేస్త్రీలకు కింది పని వారు రాళ్ళు అందిస్తున్నట్లే సేతువు కడుతున్న నలనీలులకు వానరులు కొండలను ముక్కలు ముక్కలుగా అందించారట.[21] వానరులు మోసుకొని వచ్చిన కొండలను విసిరి సముద్రంలోకి వేస్తున్నారు. దానితో నీరు ఎగజిమ్మి, కడుతూవున్న సేతువుకు విసురుగా తగిలి కట్టడాన్ని సడలించి సందులు పడుతున్నాయి. ఆ సందులకు గుండ్లు కొట్టి మళ్ళీ పూడుస్తున్నారు.[22] ఒకచోట స్ఫటికపు కొండలతో వంతెన పడింది. దానిమధ్య నల్లటి కొండల అతుకు వుంది. అది స్తిమితమైన సముద్రపురంగులో వుండడంవల్ల గండిలాగనే కనిపిస్తున్నదట[23] వీటినిబట్టి ఈ కవి కార్మికుల చర్యలను శ్రద్ధతో పరిశీలించడం మనకు స్పష్టమవుతుంది.

యుద్ధాలలో భూదగ్ధ విధానం ఉభయ పక్షంవారూ అనుసరించడం అనాదిగావుంది. ఈవిధానం (Searched earth Policy) ద్వితీయ ప్రపంచ సంగ్రామంలో రష్యావారి విజయానికి కారణమయింది. వారు తమ శత్రువులకు ఏమీ దొరకకుండా కాల్చి బుగ్గిచేసి గ్రామాలు ఖాళీచేసి వెళ్లేవారు. ఈ విధానాన్ని ప్రవరసేనుడు వర్ణించాడు. సముద్రం "ప్రళయ దగ్ధ విధ్మాత త్రిలోకీ శ్యామలం"— ప్రళయకాలంలో కాల్చి ఆరిన భూమివలె నల్లగా వుందట.24

ఆశాబంధమనే పదబంధాన్ని గాథాసప్తశతీకారుడు మొదట వాడాడు. కాళిదాసు దానిని "ఆశాబంధః కుసుమ సదృశః" అని వాడినాడు, మేఘదూతంలో. ప్రవరసేనుడు ఈ ఆశాబంధాన్ని సముచితంగానే వాడినాడు. సీతాన్వేషణకోసం హనుమ బయలుదేరాడు; తిరిగి రావడం తడవయింది. ఆ రాముని అదృశ్యమానమయిన ఆశాబంధంవంటి హనుమంతుడు వెళ్ళి, తిరిగి రావడం తడవుకాగా, మొదలే చిక్కిపోయిన రాముని శరీరం మరింత క్షీణించింది, కన్నీరు నిండిన ముఖం మరింతగా రోదించినట్లు కనిపించింది. —అంటాడు కవి.

"ఛిజ్జఇ ఛిణ్ణావి తణూ
అట్ఠిఅ వాహం పుణో పరుణ్ణంవ ముహమ్;
రామస్స అతీసంతే
ఆసాబంధేవ్వ చిరగఏ హణుమంతే. 1, 35

(క్షీయతే క్షీణాపి తనుః
అస్థిత బాష్పం పునః ప్రరుదిత మివ ముఖమ్
రామస్య అదృశ్యమానే
ఆశాబంధ ఇవ చిరనిర్గతే హనుమతి)

కుంభకర్ణాదులు మరణించినప్పుడు రావణుడు దుఃఖించాడు. అతని కనుల నుండి కన్నీటి చుక్కలు మండుతూ పడ్డాయట. దీపం నుంచి మంటతోపాటు పడే నూనె చుక్కల్లాగ. 25

ప్రవరసేనుడు రాజయినా, రాజరంజకవులు చెప్పని 'అపూర్వ భావనలను, సామాన్య విషయాలకు సంబంధించిన వాటిని ఎన్నిటినయినా చూపవచ్చు.

## గఉడవహో

గఉడవహో అంటే గౌడవధం గురించిన కావ్యం. ఈ కావ్యకర్త వాక్పతిరాజు మాలవరాజయిన యశోవర్మ ఆస్థానకవి. కాలం క్రీస్తుశకం 750. యశోవర్మ మగధ గౌడరాజును వధించడం దీని ఇతివృత్తం. కాని, కావ్యమంతా యశోవర్మ రణప్రస్థానంతోనే పూర్తయి, చివర కొన్ని గాథలతో గౌడవధను తెలుపుతుంది. ఇది సర్గ విభాగంతో కాక, కులకమనే పద్ధతిలో రచితం. కావ్యమంతా రణాభియాన ప్రధాన కావడంవల్ల; వాక్పతిరాజు తలచిన మహాకావ్యానికిది పూర్వరంగమేమోనని విమర్శకులు భావిస్తున్నారు. వాక్పతిరాజు ఈ కావ్యంలో గ్రామసీమల రామణీయకాన్ని, ప్రజల సహజస్వభావాన్ని పాడయిపోయిన గ్రామాల శోచనీయస్థితిని, గ్రామీణుల నిత్య జీవి

తంలోని చర్యా సహజ సౌందర్యాన్ని మనకు అద్దంపట్టి చూపాడు. తన భావనా వ్యాఖ్యను గూడ జోడించాడు.

నగరం పెరుగుతూ పోయింది నేటి నగరాల వలెనే. కనుక కుమ్మరివారికి కుండలు చేయడానికి బంకమట్టి కరువయింది, నగర పరిసరాలలో. కనుక రాజులు కుంభకారులకోసం భూములను ప్రత్యేకించి పెట్టారట 26 నేడు బియ్యం రేషనింగులాగ బంకమన్ను రేషనింగు వాక్పతిరాజు కాలంలో వుండడం ఆశ్చర్యంగా లేదూ !

యశోదవర్మ పత్తి గింజలు విడిపించే యంత్రాన్ని లోహ లోలకం అని వర్ణించాడు. నిశ అనే స్త్రీ అంధకారమనే లోహాలోలకం - పత్తి గింజలు తీసే యంత్రాన్ని తిప్పిందిట. ప్రభాతమనే పత్తి ముందుకు వచ్చి గ్రహ నక్షత్రాలనే పత్తి గింజలు వెనుకకు మిగిలిపోతే, నిశాదేవి వాటిని ఏరి వెనుకకు తోసిందట. పగలు కాగానే గ్రహగణం కాంతిని కోల్పోతుందనే విషయాన్ని కవి నిత్య జీవితంలో, గ్రామాలలో ఉన్న పత్తిగింజలు తీసే రాట్నంతో పోల్చాడు.

"తమ లోహాలో తయాణుగఅ
ముక్కగో నప్పహో తలిణ మూలో
గహ ఫలహిబీయని వహో
పచ్చా పుంజిజ్జఇ ణిసాఏ." 1193

(తమోలోహ లోలకానుగత
ముక్త ప్రభాత ప్రభః విరలమూలః
గ్రహకార్పాసబీజ నివహః
పశ్చా త్పుంజీక్రియతే నిశయా)

చింతచిగురు, చింతపూవు చాల రుచ్యమైన వస్తువులు. చింతపూత వగరుపులుపు, చిరుతీపులతో మహా ఉల్లాసకరంగా ఉంటుంది. ఒక బాటసారి పూచిన చింతచెట్టు చూశాడు. నోట్లో నీళ్ళూరాయి. పూత కోసుకొన్నాడు. అరచేత్తో వేసుకొని, నలిపి ముద్దచేసి నోట్లో వేసుకొని చప్పరించాడు. ఆ పూత మునలిగువ్వ రెక్కలవలె కర్పూరంగా వుందట.

"ఇహ చించిణీణ ఘేతూణ
కరయ లోలుంపి పిండియం పహిఓ
కబలేఇ జరఠ కలవింక
పక్ఖపరికబ్బురం కుసుమమ్." 677

(ఇహ చించినీనాం గృహీత్వా
కరతలావలుంపన పిండితం పథికః
కవలయతి జరఠ కలవింక
పక్ష పరికర్బురం కుసుమమ్)

వాక్పతిరాజు దృష్టి గ్రామాలలో చింతచెట్టు పూచగానే పిల్లలు, పెద్దలు తినడంపై పడడం ఆశ్చర్యకరం కాదు.

గ్రామాలలో బావులు లోపలి గోడలు ఉప్పు ఉరిలి పడిపోయి, పూడుకుపోయి, బావులు పైకి లేచివచ్చినట్టుందట. వాటిని బాగు పరచడం అనాడూ లేదేమో !

"ఇహ లవణుగ్గమ పరిహీణ
భిత్తి వలయత్తణేణ దీసంతి
అహిఅ వియుడాఓ
పూరణ సముణ్ణఆ కూవకోసీఓ" 679

(ఇహ లవణోద్గమ పరిహీన
భిత్తి వలయత్వేన దృశ్యంతే,
అధికవికటాః పూరణేనవ
సమున్నతాః కూపానాం కోశ్యః.")

ఉప్పు ఉరలి గోడలు లోపల పడిపోయి బావులు అకటా వికటంగా కనిపిస్తున్నవది. పూడినవి భిత్తి వలయాలు అంటే, గుండ్రని బావులు. చదరపు బావులు కావు కూపకోశాలు గొట్టాల వలె కనిపించే బావులు నీరు పైకి రావడంవల్ల, పైకి లేచి వచ్చినట్టున్నాయి.

గుడ్లు పగిలి, సాన కారడాన్ని కూడ వాక్పతి రాజు వదల లేదు. గాలికి ఊగిపోతున్న చెట్ల నుంచి పక్షుల గుడ్లు జారి పగిలి కింద పడుతున్నాయి. పగిలిన గుడ్ల కలలం – సాన గాలిలో ఎగిరి పోతున్నది తుంపరలై, గాలికి లేచిన ధూళితో కలిసి

"ఇహ వేల్లంత దుమిజ్జిఅ
భిన్నవయో అండ కలల సీ అరిణో.

వాలంతి మేహ సీఅల
ధూలిపవత ంఘిణో సవణా" 650

(ఇహ వేల్లద్రుమోజ్ఝిత
భిన్న పయోండకలల శీకరిణః
వాంతి మేఘశీతల ధూలిలవో
త్పేణశిలాః పవనాః.)

వాక్పతిరాజు గ్రామోత్సవాలను విశేషంగా వర్ణించాడు. దారిలో కనిపించిన, మామిడి చెట్టునుంచి వేలాడుతున్న మామిడికాయలు పసుపు పూసుకున్న ద్రవిడ సుందరుల గండమండలంవలె సుందరంగా ఉన్నాయట.

"ఇహ హి హారిద్దాహారి అం
దవిడ సామలీ గండమండలానీలం,
ఫల మనల పరిణామా
వలంబి అహిహరఇ చూయాణం." 598

ఇలా ఎన్నయినా సుందర రమ్యోదాహరణలు చూపవచ్చు.

ప్రాకృత కవులు సహజ సుందరంగా వర్ణించిన గ్రామదృశ్యాలను రాజరంజక సంస్కృత కవులు స్పృశించినా, పారమ్యం పొందలేదు. కాళిదాస, భారవి, మాఘులు అడపాదడపా గ్రామపరిసరాలను శాలికలమ క్షేత్రాలను వర్ణించినా ప్రాకృత కవులను మీరలేక పోయారు. వారిని అనుకరించారన్నా తప్పుకాదు. సుభాషితాలు, లోకోక్తులు. పొడుపులు మొదలయినవాటిలో ప్రాకృత ప్రజారంజక కవులదే పైచేయి.

ఇలా సామాన్య మానవుడు, అతని సామాన్య గ్రామీణ జీవితం— ఇవి రెండూ గాథాసప్తశతినుంచి, ఎలాటి ఇతర ప్రసక్తి లేని కవిత్వపు ముద్రయిన గాథాసప్తశతి నుంచి వస్తువులయి, ప్రాకృత సాహిత్యమంతా ఆక్రమించి నేడూ, మేధావుల దృష్టిలో పడినవి. 27 [సమాప్తం]

## అధోజ్ఞాపికలు

8. భారతి - 1948, ఏప్రిల్.
9. వజ్జాలగ్గం – గా :– 3, 10, వజాలం – 4.
11. వజ్జా – 15, 16.
12. వజ్జా – 280, 281., 13. వజ్జా – 270.
14. వజ్జా – 329, 330
15. గాథాస – 5–32.
16. వజ్జా – 339
17. వజ్జా : 736
18. వజా ! 550
19. వజ్జా: 613, 615, 617, 618.20 కావ్యాదర్శః
21. సేతు : 8–37
22. సేతు :8–74, 23. సేతు: 8–91,24. సేతు:230.
25. సేతు : 15–38
26. గౌడ : 503.
27. [1974 మార్చి 22, 23 తేదీలలో ఉస్మానియా విశ్వవిద్యాలయం వరంగల్లు స్నాతకోత్తర కేంద్రంలో ఇచ్చిన ఎక్స్టెన్షన్ ఉపన్యాసాలలో మొదటి ఉపన్యాసం సమగ్ర పాఠం... త్రిరా.]



# ప్రాచీన భారతదేశంలో పశువైద్యము

— డా. సూర్యదేవర రవికుమార్

భారతదేశం పురాతన కాలంనుండి సంస్కృతీ సంప్రదాయాలకు ఆటపట్టయి, ప్రపంచములోని వివిధదేశాలకు తలమానికముగా నిలిచినది. వివిధశాస్త్రములలో ఉన్నతాభ్యాసానికి వివిధదేశాల విద్యార్థులు ప్రాచీనకాలమున భారతదేశము నాశ్రయించి రనుట కనేక నిదర్శనములున్నవి. ప్రాచీన భారతీయ శాస్త్రగ్రంథాలు ఏనాడో ఇతర దేశ భాషలలోనికి తర్జుమా చేయబడినవి. భారతీయ విజ్ఞాన జ్యోతి ప్రపంచమునకు క్రొత్త వెలుగులు ప్రసాదించినది.

అయితే, ఈనాడు తమ ప్రాచీనులను గురించి ప్రాచీన గ్రంథాలను గురించి పలువురి భారతీయుల ఆలోచన తమను తాము కించపరచుకొనేదిగా ఉన్నది. పాశ్చాత్య ప్రభావానికి లోనయిన అనేకులు ప్రాచీన భారతీయులు వివిధ శాస్త్ర పరిజ్ఞానములేక మూఢ నమ్మకాలతో మత విశ్వాసాలతో జీవించేవారని భావించు చున్నారు. మూఢనమ్మకాలు, మత విశ్వాసాలు ప్రాచీన భారతీయుల జీవితాలపై అధికారం చెలాయించిన మాట వాస్తవమే. కాని యిది ఒక్క భారత దేశానికి, ఆదేశప్రజలకు మాత్రమే పరిమితము కాదు. ఆంగ్లేయుల పూర్వులు, జర్మనీవారి పూర్వులుకూడ ఇటువంటి విశ్వాసములు, నమ్మకములు కలిగినవారే. ఒకవైపున ఈ నమ్మకాలు ప్రజల భావాలను సంకుచిత పరచినా, మరొకవైపున అసాధారణ ప్రతిభతో వివిధశాస్త్రాలు, విజ్ఞాన గ్రంథాలు భారతీయుల ప్రతిభకు గీటురాయిలా వెలసినవి. సమాజములోని కొన్ని కట్టుబాట్లు, మత, కులతత్వాలు ఈ శాస్త్రగ్రంథాలను. విజ్ఞాన విషయాలను సామాన్య ప్రజలకు అందుబాటులో లేకుండా చేసినవి. ఆ గ్రంథములు సంస్కృత భాషలో రచింపబడుట, సామాన్య ప్రజలలో నిరక్షరాస్యత ప్రబలి యుండుట, దీనికి మరికొంత తోడయినవి. విదేశీయులు కొందరు ఆ గ్రంథాలలో చెప్పబడిన విషయాలకు ఆశ్చర్యపడి సంస్కృత భాషను అధ్యయనముచేసి వాటిని తమతమ భాషలలోనికి తర్జుమా చేసికొని ప్రచురించి వారివారి దేశానికి, ప్రజలకు మహోపకార మొనర్చిరి. ఇది పాశ్చాత్యుల విజ్ఞానాభిలాషకు, మన వారిలో పేరుకు పోయిన పాత చింతకాయపచ్చడి తత్వానికి నిదర్శనము. కొందరి మనస్సులలో భద్రపరుపబడిన గ్రంథాలను, తాటియాకులపై వ్రాయబడిన శాస్త్రగ్రంథాలను ముద్రించి వెలుగులోనికి తెచ్చు ప్రయత్నమే మనవారికి లేదు. మనవేదాలు, వేద సంబంధమైన గ్రంథాలు మొట మొదట ప్రచురించినది విదేశీయులే వేదాలతో పాటు అనేక భారతీయ శాస్త్ర గ్రంథాలను వారే ప్రచురించారు. ప్రచురించుచున్నారు. వాటిని ఆధారం చేసకొని వారు పరిశోధనలు చేసి తెలియచెప్పిన కొన్ని విషయాలకు మనం పాశ్చాత్య ముద్రను వేసి వారి గొప్పతనానికి దివిటీలు పడుతూ మన ప్రాచీనుల ప్రతిభను చీకటి కొట్లలో సమాధిచేయుచున్నాము. పాశ్చాత్య విద్వాంసులు తమ పరిశోధనలకు, విజ్ఞానాభివృద్ధికి ప్రాచీన భారతీయ విజ్ఞానమే మూలమని చెప్పినపుడు మనం మా తాతలు గొప్పవారంటూ మీసం మెలివేయుచున్నాము. కాని ఆ గొప్పతనాన్ని మనమే ముందుగా సహేతుకంగా ప్రపంచానికి తెలియచెప్పలేకపోతున్నాము. కొన్నివేల సంవత్సరాలనాడు వ్రాయబడిన శాస్త్ర గ్రంథాలలోని విషయాలు ఆధునిక శాస్త్ర పరిశోధకులకు తగిన సమాచారాన్ని అందించగలుగుతున్నాయి అంటే, ఆ శాస్త్రగ్రంథాలు అజరామరాలని, ఇంకా కొన్నివేల సంవత్సరాలు గడిచినా వాటివిలువ తగ్గిపోదని చెప్పటం అతిశయోక్తిగా భావించరాదు. అటువంటి శాస్త్రవిషయాలలో ఒకటయిన పశు వైద్యమును గూర్చి, ప్రాచీన భారతదేశములోని పశువైద్య విధానాన్ని

పశుపోషణ పద్ధతులను గూర్చి స్థూలంగా పరిశీలించటమే ఈ వ్యాసోద్దేశము.

పశువులు, పక్షులు మానవుని నిత్యజీవనంలో విశేషమైన పాత్రను పోషిస్తున్నాయి. ఆదికాలంనుంచి మానవుడు పశుపక్ష్యాదులను ఆశ్రయించే జీవనము గడుపగలుగుచున్నాడు. అవి మానవుని ఆకలి బాధను తీర్చటమే కాకుండా అతనికి అనేక విషయాల్లను బోధించినవి. పోట్లాడుకొనే కోడిపుంజును పోరును, పౌరుషాన్ని, కుక్క జాగ్రత్తను, పిల్లి నిశ్శబ్దంగా నడవటాన్ని, పాము పాకటాన్ని గుర్రం పరుగును, ఈ విధంగా అనేక జంతువులు అనేక విషయాలను బోధించినవి. మానవునకు వివిధ అనుభవాలను నేర్పాయి. అనుభవమే విజ్ఞానాభివృద్ధికి తొలిమెట్టు కదా!

ప్రసవ సమయంలో స్త్రీలను ఎలా కాపడవలసినది మానవునకు ఏనుగులు నేర్పినవి. చూడి ఏనుగు కొద్ది రోజులకు ప్రసవించునసగా మగ ఏనుగులు అడవి అంతా తిరిగి, పచ్చిక వత్తుగా పెరిగి ప్రమాదముకాని స్థలమును పరిశీలించి చూడి ఏనుగును ఆ ప్రాంతానికి తీసుకువెళ్లును. అది ప్రసవించే సమయంలో మగ ఏనుగులు దానికి కొంత దూరమున చుట్టూ నిలబడి ఏ ఇతర జంతువు ఆ ప్రాంతమునకు రాకుండా కాపలా ఉండును. అనుభవంగల రెండు మూడు ఆడఏనుగులు ప్రసవించే ఏనుగువద్ద ఉండి మంత్రసానులులా పనిచేయును. ప్రసవం పూర్తి అయిన తరువాత అన్నీ కలిసి పసియేనుగును, బాలెంతను తగిన రక్షణలో సురక్షిత ప్రాంతానికి చేర్చును. మానవుని ప్రాథమికావస్థలో ఇటువంటి పరిశీలనలు అతనికి ఎన్నో విషయములను బోధపరచినవనటం సత్యదూరం కాదు.

ఆధునిక పరిశోధకులు, శాస్త్రవేత్తలు కొందరు, మానవునకు వైద్యశాస్త్రాన్ని పశుపక్ష్యాదులే నేర్పినవని గట్టిగా చెప్పుచున్నారు. దీనికి వారు కొన్ని ఉదాహరణలు కూడ ఇచ్చారు, హిప్పోపొటమస్ అనే జంతువు అధికాహారం వలన విపరీతంగా లావెక్కినప్పుడు విరిగి మొనదేరిన చెట్టుకొమ్మకో, సూదివలె మొనదేలిన మరొక వస్తువుకో తన తొడను మోటించి తొడలోని ఒక సిరను గాయపరచుకొనును. రక్తంగా కొంత నెత్తురుపోవును. దానితో దానికి కొంత ఉపశమనము కలుగును. తరువాత ఆ గాయాన్ని బురదతో కప్పివేయును. ఏనుగులు కడుపు నొప్పితో బాధపడుతున్నప్పుడు చవుడు మట్టిని విశేషంగ తినును. అది విరేచనాన్ని కలిగించి బాధను తగ్గించును. ముంగిస, విషసర్పముతో పోట్లాడే సమయములో ఆ సర్పము కాటు వేసినచో వెంటనే సమీపమున గల ఒక వృక్షమును కొరికి తద్వారా ఆ విషాన్ని నివారించుకొని మరల పాముతో పోట్లాడును. తనకు కావలసిన ఆ ఓషధి లేనిచోట ముంగిస విషసర్పముతో తలపడదు. ఈ విధంగా వివిధ జంతువులు తమ తమ బాధలను నివారించుకొనటానికి అవలంబించే పద్ధతులను ఆదిమానవుడు సూక్ష్మదృష్టితో గ్రహించి వైద్య విజ్ఞానాన్ని సంపాదించుకొనినాడు.

అధర్వవేదంలోని ఈ క్రింది మంత్రాలవలన మానవునకు వైద్యశాస్త్రమున పశుపక్ష్యాదులే గురువులు అని విశదమగుచున్నది.

వరాహో వేద వీరుధం నకులో వేద భేషజీమ్
సర్పా గంధర్వా యా విదు స్తా అస్మా అవసే హువే॥

యాః సుపర్ణా ఆంగిరసీ ర్దివ్యా యా రఘటో విదుః
వయాంసి హంసా యా విదు ర్యాశ్చ సర్వే పతత్రిణః
మృగా యా విదు రోషధీస్తా అస్మా అవసే హువే॥

యావతీనామోషధీనామ్ గావః ప్రాశ్నన్త్యఘ్న్యా
యావతీనా మజావయః
తావతీస్తుభ్యమోషధీః శర్మయచ్ఛన్త్వాభృతాః॥

యావతీషుమనుష్యాః భేషజం భిషజో విదుః
తావతీర్విశ్వ భేషజీ రా భరామి త్వామభి॥

పై పంక్తుల భావాన్ని స్థూలంగా ఈవిధంగా చెప్పుకొనవచ్చును.

పంది ఓషధీలత నెరుగును. ముంగిస రోగనివారణకారి(యగు వృక్షము) నెరుగును. సర్పములు, గంధర్వులు వేని నెరుగుదురో వాటిని అతనికి సహాయపడుట కొరకు ప్రార్థించుచున్నాను.

ఏ యే ఓషధులను ఆంగిరసాదులెరుగుదురో, హంసలు, సర్వపక్షిగణము ఏ యే ఓషధుల నెరుగునో, అడవి జంతువులు ఏయే ఓషధులను గుర్తెరుగునో వాటిని అతనికి సహాయపడుట కొరకు ప్రార్థించుచున్నాను.

ఓషధులలో ఎన్నింటిని గొర్రెలు,మేకలు ఎరుగునో అవన్నియు నీ కొరకు తేబడినవై నీకు సుఖమును కలిగించును.

ఓషధులలో ఎన్నిటిని మానవులైన వైద్యులు చికిత్స నిమిత్తము ఎరుగుదురో అన్నిటిని నీ కొరకు తెచ్చెదను.

ఈ విధంగా పశువులు, పక్షులు మానవునకు వైద్యశాస్త్రాన్ని బోధించటమే కాకుండా ఈనాటకి కూడ వైద్యశాస్త్రపురోగమనానికి, వివిధ ప్రయోగములను నిర్వహించటానికి ఉపయోగపడుతున్నాయి. కనుక వైద్యశాస్త్రానికి పశుపక్ష్యాదులే మూలమని చెప్పుకొనటము అతిశయోక్తిగా భావించరాదు.

ఆదిమానవుడు పశువులను పక్షులను వేటాడి చంపి మొదట పచ్చిమాంసమును, నిప్పును కనిపెట్టిన తరువాత కాల్చిన మాంసమును తిని జీవనము గడుపుచుండెడివాడు. క్రమముగా అనేక జంతువులను మానవుడు మచ్చిక చేసికొని వాటిని సద్వినియోగ పరచుకొనుచుండెడివాడు. వేదకాలమునాటికి వ్యవసాయము, పశుపాలన బాగ అభివృద్ధి చెందినవి. వ్యవసాయమును అసురగణములు, పశుపాలనను దేవగణము ప్రధాన వృత్తులుగా స్వీకరించినవి. ఆవులు, ఎద్దులు ప్రత్యేక శ్రద్ధతో పోషింపబడినవి. పశువులను రాత్రిపూట, మిట్టమధ్యాహ్నము కొట్టములలో కట్టివేసి మిగిలిన సమయములలో పచ్చిక బయళ్ళలో మేపెడివారు. పశువుల రక్షణ విషయమై పనిచేయు ఎద్దులకు ప్రథమస్థానమును, పాలిచ్చు ఆవులకు రెండవ స్థానమును, ఇతర జంతువులకు తృతీయస్థానమును ఇచ్చెడివారు. ఈ విధమైన రక్షణను కల్పించవలసినదిగా సహదేవి అను ఓషధిని ప్రార్థించెడివారు. పశువులను దొంగిలించుట ఆ కాలమున కూడ ఉండెడిది. అందువలన పశువుల చెవులకు గుర్తులు (Tatosing marks) వేసెడివారు. పశువుల రెండు చెవులపైన ఈ గుర్తులుండెడివి. స్త్రీ పురుషుల మర్మావయవములను బోలిన ఈ గుర్తులు రాగితో వేసెడివారు. దీనివలన పశువులు వేయిరెట్లు అభివృద్ధి చెందునని అథర్వ వేదములో చెప్పబడినది. ఆవులు మేతకు అరణ్యమునకు వెళ్ళునప్పుడు ఆబోతులు వాటి ననుసరించి వెళ్ళి వాటితో తిరిగి వచ్చెడివి. పాలను రోజుకు మూడుసార్లు పిండెడివారు. పాలు పితుకుటకు ప్రత్యేక నైపుణ్యము గలవారి నుపయోగించెడివారు.

ఆ కాలమున పశువులే ధనము. కనీసము ఆరు పశువులైనను లేనివాడు బీదవాడుగా భావింపబడుచుండెడివాడు. ప్రజలు తమ గోజాతి అభివృద్ధి కొరకు ప్రార్థనలు చేసెడివారు. పశువులు పవిత్రముగా భావింపబడుచుండెడివి. వాటిని అందముగ అలంకరించుట ఆ కాలము వారికి బాగుగ తెలియును. ముక్కుకు త్రాడునువేసి లొంగని పశువులను వశపరచుకొనెడివారు.

యజ్ఞ యాగాదులలో పశువుల పాత్ర విశిష్టమైనది. యజ్ఞమునకు కావలసిన సోమరసమును గొఱ్ఱెల రోమములతో నిర్మింపబడిన వస్త్రముతో వడకట్టెడివారు ఆ వస్త్రమును పవిత్రమనెడి వారు. సోమరసముగల పాత్రల నుంచుటకు ఎద్దు చర్మము నుపయోగించెడివారు. చర్మముతో సంచులు తయారు చేసెడివారు. యజ్ఞయాగాదులలో వివిధ పశువులను వివిధ దేవతలకు బలియిచ్చెడివారు. బలి యిచ్చుటకుముందు ఆ బలిపశువును సుందరముగ అలంకరించెడివారు. పశువును చంపి, దాని శరీరము నేలను తాకకుండా దర్భలపై ఉంచి ఆ పశువుయొక్క ఒక్కొక్క అవయవము కోసి హోమము చేసెడివారు. ఈ విధముగా ఒక క్రమపద్ధతిలో పశువుయొక్క వివిధావయవములను, కండరములను, మాంస ఖండములను హోమము చేయుట కుపయోగించుటవలన వారికి పశువుయొక్క అంతర్ శరీర నిర్మాణమును,–అనగా వివిధ కండరములు, ఎముకలు, కీళ్ళు, నరములు మొదలగు వానిని గురించిన వివరములను–అధ్యయనము చేయుటకు చక్కని అవకాశము లభించెడిది. వివిధమాంసఖండములకు వివిధములగుపేర్లు కనిపించుచున్నవి. చూడి ఆవులనుకూడ హోమము కొఱకు వధించెడివారు. వివిధదేవతలకు వివిధ వర్ణములుగల పశువులు ప్రియమని ఆయా దేవతలకు ఆయా వర్ణములుగల పశువులనే బలియిచ్చెడివారు. ఇట్లే వివిధకాలములలో బలియిచ్చుటకు వివిధవర్ణములుగల పశువులు నిర్దేశింపబడినవి. ఈవిధముగా చేయుట వలన కొన్ని కార్యములు నెరవేరగలవని వారి నమ్మకము. ఉదాహరణకు గోధుమ వారిన పశువును ఆదిత్యదేవతలకు బలియిచ్చుటవలన భూమి విస్తృతమై ఓషధులు పుట్టినవట. హోమమునకు ఉపయోగింపబడిన జంతువు స్వర సౌఖ్యముల ననుభవించునని చెప్పబడినది. హోమములను నిర్వర్తించునపుడు తప్ప ఇతర సమయములలో పశువధ కన్పించదు.

ఎద్దులను ప్రధానముగా నాగలి దున్నుటకు బండి లాగుటకు ఉపయోగించెడివారు. నాగలికి 6 నుండి 24 వరకు ఎడ్లను కట్టెడివారు. ఆవు వర్ణమునకు దాని పాల రంగుబడి, నాణ్యతకు సంబంధము కలదని ఆనాటి వారికి తెలియును. నలుపు లేక ఎఱ్ఱ [illegible] రంగు కల ఆవుపాల ఇతరవర్ణముల ఆవుల పాలకంటె ప్రశస్తము [illegible] అని తెలుపబడినది.

వేదకాలమున పశువైద్యము ప్రాథమిక దశలో నున్నది. అనేక విధములగు రోగములను నివారించుటకు మంత్రములు, [illegible] సూచింపబడినవి. సహదేవి అను ఓషధి [illegible] టకు ప్రార్థింపబడినది. పశువుల కడుపులోని [illegible] నివా

రణ అథర్వవేదములో చెప్పబడినది. దూడలపై అవులకు ప్రేమ కలుగుటకు, దొంగలు, పులులు, పశువులను కబళించకుండుటకు వివిధ సూక్తములు చెప్పబడినవి. పశు వైద్యము అంతగా అభివృద్ధి చెందకున్నను పశుపాలన, పోషణ విషయమై వేదకాలమున చూపబడిన శ్రద్ధ ప్రశంసనీయమని, నేటికిని ఆదర్శవంతమైనదని వేరుగా చెప్పవలసిన పనిలేదు.

వేదకాలమున వివిధ దశలలోగల పశువులకు వివిధములైన పేర్లు వాడుకలో నున్నట్లు తెలియుచున్నది. పశువుల వివిధాంగములు ఆ యా పేర్లతో పేర్కొనబడినవి. ఇది పశుపాలన, పోషణలపై ప్రాచీనులకు గల శ్రద్ధకు ఆసక్తికి నిదర్శనము. వేదములలో ఉదహరింపబడిన కొన్ని పదములు ఈ క్రింద పేర్కొనబడినవి.

ధేనువు : పాడి ఆవు
అభివాన్య : దూడ చచ్చిన ఆవు
పష్ఠౌహి : లేత చూడి ఆవు
పర్యారణి : ప్రసవకాలము అతిక్రమించిన పిమ్మట ప్రసవించిన ఆవు
వేహాతము : దూడలు చచ్చుచున్న ఆవు
సూతవశ : ఒక పర్యాయము ఈని పిదప ఈనక గొడ్రాలయిన ఆవు
వశ : గొడ్రాలయిన ఆవు
వృషభము : ఆబోతు
మహానిరష్టము : సలగగొట్టబడిన వృషణములు గలది (ఎద్దు)
కకుత్ : ఆబోతు భుజములమీద నున్న మాంసపుకండ
పర్శ్వాతి : [illegible]
ఊధస్సు : పొదుగు
సితాముఖము : ముందరికాలు
అణి : వృషణములు
శక్తి : తొడ ఎముక
క్రవ్యము : పచ్చిమాంసము

వైదిక వాఙ్మయమున పశువులకు దేవత్వము కల్పింపబడినది. శతపథ బ్రాహ్మణమున ఎద్దు ఇంద్రుని రూపముగా చెప్పబడినది. వేదములలో ఇంద్రుడు, అగ్ని, రుద్రుడు, ఇతర దేవతలు కొందరు వృషభశబ్దముతో పేర్కొనబడిరి. 'వృషభో వర్షితావావ్' అని నిరుక్తములో వివరింపబడినది. అనగా వర్షమును కురిపించునదే వృషభము అని భావము. [దీనిననుసరించియే కాబోలు వృషభరూపమైన నందికి అభిషేకములు చేసిన విస్తారమగు వర్షము కురియునను సంప్రదాయమేర్పడినది. కొన్నికొన్ని దేవాలయములలో ఈ విధమగు అభిషేకములు జరుగుచున్నవి. ఇటీవల తంజావూరు బృహదీశ్వరాలయములోని నంది విగ్రహమునకు అభిషేకము జరిపిన పిదప ఆ ప్రాంతమున మంచివాన కురిసినట్లు పత్రికలలో వచ్చినవార్త యీ సందర్భమున గమనింప దగినది] దేవతలు కొన్నిచోట్ల గోజాతులుగా పిలువబడిరి. గోమాంసమును భక్షించిన పునర్జన్మను పొంది అపకీర్తిపాలగుదురని శతపథ బ్రాహ్మణము చెప్పుచున్నది. అయినప్పటికిని అతిథులకు గోమాంసమును పెట్టు ఆచారము ప్రాచీనకాలమున ఉండెడిది. (ఉత్తరరామచరిత నాటకమున భవభూతి యీ ఆచారమును సూచించినాడు) మేక పూషదేవత రథమును లాగే జంతువుగా వేదములలో చెప్పబడినది. అనంతర కాలమున ఇది అగ్నిదేవతకు సంబంధించినదిగా పేర్కొనబడినది. అశ్వినీ దేవతల రథమును లాగుటకు గాడిదలు నియమింపబడినట్లు పేర్కొనబడినది. కుక్క, పంది, కోతి, తాబేలు, కప్ప మొదలగు జంతువులు వేదములలో దేవతలతో సంబంధము కల్పింపబడినవి.

పక్షులకు ఆకాశ మార్గమునతో లోగిల సాధనములు గల్గియున్నవి. అమృతమును సంపాదించుకొనుటకు ఇంద్రుడు గరుడుని రూపమును దాల్చెనట. పావురము, గుడ్లగూబ యముని సేవకులుగా చెప్పబడినవి. ఇంద్రుని ప్రత్యర్థియైన వృత్రుడు పాముగా చెప్పబడినాడు. వేదకాలమున పశువైద్యుల ప్రయోగములను సూచించుటకే విషయములు చాలును.

అనంతరకాలమున పశుపోషణ పద్ధతులు, పశువైద్యశాస్త్రము విశేషముగా అభివృద్ధి చెందినవి. ధనమన్న పశుసంపదయే అను అభిప్రాయము గాఢముగా ఏర్పడినది. గృహ్య సూత్రములలోని కొన్ని మంత్రములు పశురూపమైన ధనసమృద్ధికై ఏర్పరుపబడినవి. సమాజములోని ఉన్నత కుటుంబీకులు పశువులను విశేషముగా పోషించెడివారు. బహుమానములు విశేషముగా గోరూపమున నుండెడివి. గర్గి, యాజ్ఞవల్క్యుల సంవాదములో గెలుపొందిన యాజ్ఞవల్క్యునకు జనక మహారాజు ఒకొక కొమ్మున అయిదేసి బంగారు నాణెములు అమర్చబడిన వేయి ఆవులను బహుమానముగా ఇచ్చెనట.

పశుసంపద తరిగినపుడు వాటి పునరభివృద్ధికై హోమములు చేసెడి వారు. గోవధ యీకాలమున తీవ్రముగా నిరసింపబడినది. శాస్త్ర పురాణములు పశువులను వివిధ దేవతలకు వాహనములుగా ఏర్పరచ టమేకాక పశు పాలన, పోషణ, చికిత్సలపై అనేకాంశములను వివరించినవి.

అగ్నిపురాణమున ఆవు, ఏనుగు, గుఱ్ఱములను గూర్చి వాటి వ్యాధులను గూర్చి చెప్పబడినది. మత్స్యపురాణమున ఎద్దుల లక్షణ ములు వర్ణింపబడినవి. గరుడ, బ్రహ్మాండపురాణములలో కూడ యీ విషయమై వివరించబడినది. విష్ణుపురాణమున ఆబోతును గూర్చి యీవిధముగా చెప్పబడినది. ఆబోతు, ఎక్కువ పాలను ఇచ్చే ఆవుకు దూడగా తిండి, ఆవులన్నిటిని యితర జంతువులనుండి రక్షించగలిగి యుండవలెను. ఆబోతును ఈనిన ఆవుకు పుట్టిన దూడలన్నీ సజీవముగా ఉండవలెను. ఏదీ చనిపోయి ఉండకూడదు. శుక్రనీతిలో వివిధ పశు వైద్యశాస్త్ర విషయములతోపాటు ఎద్దు వయసును నిర్ణయించు పద్ధతులవంటి ఆసక్తి కరమగు విషయములు వివరింపబడినవి. హారీత సంహితలో వివిధ జంతువుల వ్యాధులకు చికిత్సలు తెలుపబడినవి. పరాశర సంహితలో చూడి ఆవుల ఆలన పాలన వివరింపబడినది. మహాభారతములో నకుల సహదేవులు అశ్వ, గోపాలకులుగా విరాటుని కొలువులోనున్నట్లు తెల్పబడినది. అందే పశువుల లెక్కలు (cattle cences) ఆబోతుల వంశవర్ణన (pedigree) పట్టికలు తయారుచేయు విధానములు వివరింపబడినవి. కౌటిల్యుని అర్థశాస్త్రము పశుపాలన, చికిత్సలను గురించి అనేక విషయములను పేర్కొనుచున్నది. ఆకాలమున గోవులకు, గుఱ్ఱము లకు ప్రత్యేకముగా ఒక్కొక్క అధికారి నియమింపబడెడివాడు. దేశములో గల పశువుల లెక్కలను సిద్ధము చేయించుట, మంచిజాతి పశువులను అభివృద్ధిచేయుట, పశువుల శాలలను నిర్మింపచేయుట పశుపోషణ విషయములపై శ్రద్ధవహించుట ఆ యధికారి విధులు.

శాస్త్ర పురాణములలోనేకాక కావ్య, నాటకములలో గూడ పశుపాలన, చికిత్సలను గూర్చి సందర్భాను సారముగా తెలియజేయ బడినది. ప్రతిజ్ఞా యౌగంధరాయణములో భాసుడు ఏనుగు గాయ ములకు చికిత్సను తెలిపెను. రఘువంశము (5–73) న కాళిదాసు వ్రాసిన దానినిబట్టి అకాలమున సైంధవలవణము (Rock Salt)ను గుఱ్ఱపుశాలలలో ఎల్లప్పుడు ఉంచెదరని, గుఱ్ఱములు ఉదయకాలమున ఆ ఉప్పును తీసికొనుచున్నవని తెల్పియున్నాడు. ఉత్తమ జాతికి చెందిన గుఱ్ఱముల విషయమై యీవిధమైన శ్రద్ధ యీనాడు ప్రపంచమందంతటను కనబడుచున్నది. హర్ష చరితలో బాణభట్టు రాజులఅశ్వశాలలను గురించి అనేక విషయములను తెల్పియున్నాడు. శివతత్త్వ రత్నాకరమను గ్రంథమున బసవమంత్రి కోడిని గురించి ఆసక్తికరమగు విషయములను వివరించెనట. మరికొన్ని కావ్య నాటక ములలో గూడ పశువైద్యమును గూర్చి వివరములు గలవు.

సాధారణ వైద్య గ్రంథములలోకూడ పశువైద్యమునుగూర్చి వివరింపబడినది. చరకుడు వివిధ జంతువులను వాటి ప్రవర్తన ననుసరించి 11 రకములుగాను, వెన్నెముకగల జంతువులను వాటి ఆహారపు టలవాట్లు నివాస స్థానములనుబట్టి ఎనిమిది రకములు గాను వర్గీకరించెను. శుశ్రుతుడు అనూపములు, జాంగలములు అని జంతువులను రెండు ప్రధాన వర్గములుగాచూపి ఒక్కొక్క వర్గమును తిరిగి విభజించెను. చరకుడు జంతువుల వర్గీకరణతోపాటు వివిధ జంతువుల పాలు, మూత్రము, మాంసముల గుణగణములను చక్కగా వివరించెను.

కాలక్రమమున పశువైద్యమునే ప్రత్యేకముగా వివరించు గ్రంథము లనేకము బయలుదేరినవి. ఇందు ప్రముఖముగా చెప్పదగి నవి సహదేవుని పశువైద్యశాస్త్రము, శాలిహోత్రుని అశ్వశాస్త్రము, పాలకాప్యుని హస్త్యాయుర్వేదము. పై గ్రంథములలో మొదటి రెండిటికిని తెలుగు అనువాదములు గలవు. శాలిహోత్రుని గ్రంథము శాలిహోత్రీయము అను పేరున ప్రఖ్యాతి గాంచినది. మొగలాయీ చక్రవర్తి షాజహాన్ చిత్తూరుసందు ఈ గ్రంథమును సంపాదించి దానిని సయ్యద్ అబ్దుల్లాఖాన్ బహదూర్ ఫిరోజ్ జంగ్‌చేత అరబ్బీ భాషలోకి తర్జుమా చేయించెనట. ఆంగ్లేయులు భారతదేశమునకు వచ్చిన తొలిరోజులలో ఈ అరబ్బీ గ్రంథమును ఆంగ్లభాషలోనికి మార్పించినటుల, ఆ గ్రంథప్రతులు రెండు—ఒకటి లండన్ మ్యూజ యంలోనూరెండవదిబెర్లిన్‌లైబ్రరీలోను–మాత్రముప్రస్తుతములభించు చున్నటుల తెలియుచున్నది. ఇదే గ్రంథము టిబెట్ భాషలోనికి కూడ తర్జుమా చేయబడినది. ఇంత ప్రఖ్యాతిగాంచిన ఈ గ్రంథము నేటికిని భారతీయుల ఆదరాభిమానములకు సరిగా నోచుకొనలేదు. దేశమున గల వివిధ ప్రాచ్యగ్రంథాలలో ఈ గ్రంథప్రతులు క్రిమికీటకాదుల కాహారమగుచు జీర్ణస్థితిలో నున్నవి. వీటి నన్నిటిని సమీకరించి పరి ష్కరించి మూలగ్రంథమును వెలుగులోనికి తీసికొని రావలసిన బాధ్యత

సంస్కృత పండితులపైన, భారతీయ పశువైద్య శాస్త్రజ్ఞుల పైన గలదు.

రాజతరంగిణిని వ్రాసిన కల్హణుడు "శాలిహోత్ర సారసముచ్చయ" మను గ్రంథమును కూర్చెను. శాలిహోత్రమను పేరున అనేకులు పశు వైద్య శాస్త్ర గ్రంథములను వ్రాసిరి. కాశ్మీరదేశీయుడగు జయద్రథుడు అశ్వశాస్త్రమను గ్రంథమును వ్రాసెను. వాగ్భటుడు అశ్వాయుర్వేదమును వ్రాసెను.

నీలకంఠ కవి వ్రాసిన మాతంగలీల, నారాయణ దీక్షితులవారి గజగ్రహణ ప్రకారము, పాలకాప్యుని హస్త్యాయుర్వేదము ఏనుగులను పట్టుకొను పద్ధతులను, వాటికి తగిన శిక్షణ నిచ్చు విధానమును పాలన, పోషణ, రోగశాంతి మొదలగు విషయములను వివరించును. ఈ గ్రంథములలో చెప్పబడిన ఏనుగులను పట్టుకొను పద్ధతులలో కొన్ని నేటికిని వాడుకలో గలవు. అశ్వ, గజ, గోవైద్య శాస్త్రములపై వ్రాయబడిన సంస్కృత గ్రంథముల పట్టిక ఈ వ్యాసమున కనుబంధముగ నీయబడినది.

తెనుగున కూడ పశువైద్య శాస్త్ర గ్రంథము లనేకము వెలసినవి. వీటిలో నారన మంత్రి వ్రాసిన సహదేవ పశువైద్య శాస్త్రము బహుళ ప్రచారము పొందినది. మనుమంచిభట్టు అశ్వలక్షణ శాస్త్రము నొకదానిని వ్రాసెను. శాలిహోత్రీయమును నారన తెనిగించెను. ఇవిగాక తుది మొదళ్ళులేనివి, అసంపూర్ణమైనవి మరి కొన్ని గ్రంథములు కన్పించుచున్నవి.

తెనుగు శాసనములలో కావ్యములలో పశుప్రశస్తి పశుపాలన, పశువైద్యము పలు సందర్భములలో చెప్పబడినవి. పద్యకావ్యములలో విజ్ఞాన సర్వస్వ మనదగిన 'వాణీవిలాస వనమాలిక'లో పశువైద్యము, సంవర్ధనము వివరింపబడినవి. అందే "శాలిహోత్ర, గర్గ్య, శ్రీ శుత, నైషధ, గణ, మానప్రియ, అతికాంత, రాజకాఖ్యలం గల శాస్త్రంబు లెనిమిదియును గజరోగ నిదాన హేతుభావ చికిత్సలు వక్కాణించు"నని తెల్పబడినది.

క్రీ. పూ. ఏడవ శతాబ్దమున వెలసిన తక్షశిల విశ్వవిద్యాలయములో బోధింపబడిన 16 విద్యలలో పశువైద్యము ఒకటి. స్త్రీలు నేర్చుకొనవలసి 64 కళలలో గజపరీక్ష, అశ్వపరీక్షలు కూడ చేర్చబడినవి. ఇవి ప్రాచీన భారతీయుల పశు వైద్య శాస్త్రాధ్యయనానికి, పశు విషయ పరిజ్ఞానాసక్తికి నిదర్శనములు.

అశోక చక్రవర్తి కాలమున దేశమున వివిధ ప్రాంతములలో పశువైద్య శాలలు నెలకొల్పబడినవి. అశోకుడు ఆషాఢ మాసములోను, పునర్వసు నక్షత్రమున్న రోజున, అష్టమి, దశమి, త్రయోదశి, పౌర్ణమి, అమావాస్యలుగల దినములలో పశువులను ఎద్దు పట రాదని నియమము లేర్పరచెను. ఆ కాలమున పశువులకు ప్రత్యేకముగా పచ్చిక బీడులను ఏర్పరచి పలురకముల పచ్చికలను పెంచుచుండెడివారు. పశువులను కాయుటకుపశుపాలకు లుండెడివారు. వీరికి పశుపోషణ, ప్రాథమిక పశువైద్య పద్ధతులను గూర్చి శిక్షణ నిచ్చెడివారు నిబంధనల నతిక్రమించి పశువులను బాధించుట ఈ కాలమున నేరముగా పరిగణింప బడెడిది.

అశోకుడు బౌద్ధమును స్వీకరించక పూర్వము దేశమున మృగముల వేట, పశువుల పందెములు, ఏనుగు, ఎద్దు, గొర్రె మొదలగు జంతువుల పోట్లాటలు తరచు జరుగుచుండెడివి. ఈ విధమైన వినోద కార్యక్రమముల నన్నిటిని అశోకుడు బౌద్ధధర్మము నవలంబించిన పిదప నిషేధించెను.

బౌద్ధులు జంతు బలులను పూర్తిగా నిషేధించిరి. వారి కాలమున పశుసంవర్ధనకు విశేష ప్రాధాన్య మీయబడినది. వందలకొలది వైద్యశాలలు దేశమున నలుమూలల స్థాపింపబడినవి. పచ్చిక కొరకు విస్తారమగు భూమిని ప్రత్యేక పరచిరి. అటవీ శాఖాధ్యక్షులకు, పశుగణాధ్యక్షులకు బౌద్ధరాజ్యాంగమున ప్రముఖ స్థానముండెడిది. బుద్ధదేవుని కాలమున ఆవు పేయలను కొమ్ములతో, చెవులతో, తోకలతో లాగగూడదని, వాటిపై ఎక్కరాదని నియమము లుండెడివి.

గుప్తరాజుల కాలమున పశువుల పందెములు పునరుద్ధరింప బడినవి. వివిధ పందెములలో గెలిచిన పశువులకు బహుమతు లిచ్చెడివారు. జంతుబలులీ కాలమున నిషేధింపబడలేదు.

అయిదవ శతాబ్దమున భారత దేశమును సందర్శించిన ఫాహియాన్ మధ్య భారతదేశములో ఛండాలురు తప్ప ఇతరు లెవ్వరు మాంసమును గైకొనరని, పశువధ కన్పించదని వ్రాసెను. తొమ్మి

దవ శతాబ్దమున ఒక్కొక్క జాతి జంతువులకు ఒక్కొక్క వైద్యుడు నియమింపబడినట్లు నిదర్శనము లున్నవి.

కాకతీయుల శిలా శాసన ఫలకములపై ఆవు, లేగదూడ, ఎద్దు మొదలగు జంతువుల చిహ్నములు కనిపించుచున్నవి. ఈ కాలమున భారతీయులు ఎద్దుల విగ్రహములను నొసట కట్టుకొని తిరుగుచున్నారని ఒక విదేశీయుడు వ్రాసెను. గుజరాత్‌కు చెందిన చాళుక్య రాజులు కుమారపాలుడు (1220–1229) జంతు వధను నిషేధించుచు ఒక శాసనము చేసెను. కాని ఇదేకాలమున ఆంధ్రదేశమున జంతుబలులు కొనసాగుచుండినవి. పలనాటి బ్రహ్మనాయుడు యుద్ధమునకు వెళ్ళునప్పుడు దున్నపోతును బలియిచ్చెనట.

క్రీ. శ. 14 వ శతాబ్దిలో భారతదేశమును సందర్శించిన ఫియర్ అను విదేశీయుడు ఈదేశమున ఎద్దను ఆరేండ్లు మాత్రము పనిచేయించి తరువాత బహిరంగ ప్రదేశములలో విడచిపెట్టు ఆచారము కలదని వ్రాసెను. 15 వ శతాబ్ది ప్రారంభమున కాటయ వేముని కుమార్తె అనితల్లి వేయించిన కలువచేరు శాసనమున పాముకు వైద్యముచేసిన ఒక వ్యక్తి ఉదంతము గలదు. అనితల్లిచేత కలువచెరువు దానముగా గ్రహించిన బ్రాహ్మణుని మూలపురుషుడు గొప్పవైద్యుడని, అతను తన పొలమువద్దగల పుట్ట సమీపమున ఒక పాము దవడలలో ఎముక గుచ్చుకొని బాధపడుచుండగా ఆ ఎముకను తీసి ఆ గాయమునకు మందువేసి మాన్పెనని, అతని వంశీయులు పాములకు వ్యాధులు వచ్చినప్పుడు చికిత్స చేయుచుండెడివారని ఆ శాసనమువలన తెలియుచున్నది. రెడ్డిరాజులు, శ్రీకృష్ణదేవరాయలు అనంతరరాజులు పశుపోషణ, వైద్యములను గురించి చాల శ్రద్ధను కనబరచిరి. ఈ కాలములోనే అనేక పశువైద్య శాస్త్ర గ్రంథములు రచింపబడినవి.

ఆధునిక పశువైద్య విద్యాభ్యాసము 1761లో ఫ్రాన్సులోను, 1791 లో ఇంగ్లండులోను ప్రారంభమై క్రమముగా అన్నిదేశములకు వ్యాపించినది. భారతదేశములో మొట్టమొదటి పశువైద్యకళాశాల 1877 లో బాబూఘర్‌లో నెలకొల్పబడినది. శాస్త్రీయ పద్ధతులలో నిర్వహింపబడుతున్న అనేక ప్రయోగములు పశు వైద్యశాస్త్రమును పరిపుష్టము చేయుచున్నవి. కొన్ని శాఖలకు సంబంధించిన యీ పరిశోధనల ఫలితములు ప్రాచీన భారతీయ పశువైద్య శాస్త్ర గ్రంథములలో సూచింప బడిన విషయములతో సరిపోవుచున్నవి. కనుక ఈ విషయమై ప్రాచీనులు చేసిన సిద్ధాంతములను, వ్రాసిన వ్రాతలను, నవీన శాస్త్రీయ విజ్ఞానము నాధారము చేసికొని కూలంకషముగ పరిశీలించి వాటిని స్థిరపరచి స్వీకరించుటయో, లేక నిరాకరించుటయో, ఆధునిక భారతీయ పశువైద్యశాస్త్ర పరిశోధకులు నిర్ణయించవలసి యున్నది. ఈ కృషికి తొలిమెట్టుగా మరుగున ఉన్న శాస్త్రగ్రంథాలను వెలికితీసి ప్రకటించవలసి యున్నది. చిత్తశుద్ధితో ఈ కార్యములు నెరవేర్చిన నాడు భారతీయ విజ్ఞాన జ్యోతి నిశ్చయముగా ప్రపంచమునకు సరిక్రొత్త వెలుగులను ప్రసరించ గలదు.

## అ ను బం ధ ము

| క్రమసంఖ్య | గ్రంథనామము | రచయిత | ప్రతి భద్రపరుపబడిన ప్రదేశము లేక ప్రతిని గురించిన ఇతరవివరములు. |
|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 |
| | **(క) అశ్వవైద్యశాస్త్ర గ్రంథములు** | | |
| 1 | అశ్వ చికిత్స | జయదత్తుడు | దర్బార్ లైబ్రరీ, నేపాలు. |
| 2 | అశ్వ చికిత్స | నకులుడు | ... |
| 3 | అశ్వతంత్రము | తెలియదు | సరస్వతీమహాలు, తంజావూరు. |
| 4 | అశ్వ దోషనిరూపణము | తెలియదు | బిర్ లైబ్రరి, ఖాట్మండు, నేపాలు. |
| 5 | అశ్వనేత్ర పరీక్ష | తెలియదు | బిర్ లైబ్రరి, ఖాట్మండు, నేపాలు. |
| 6 | అశ్వ పరీక్ష | తెలియదు | బిర్ లైబ్రరి, ఖాట్మండు, నేపాలు. |

| క్రమసంఖ్య | గ్రంథనామము | రచయిత | ప్రతి భద్రపరుపబడిన ప్రదేశము లేక ప్రతిని గురించిన ఇతర వివరములు |
|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 |
| 7 | అశ్వ పరీక్షణము | నలమహారాజు | ... |
| 8 | అశ్వ పూజ | తెలియదు | పంజాబ్ యూనివర్సిటీ లైబ్రరి, లాహోరు. |
| 9 | అశ్వ ప్రశంస | శాలిహోత్రముని | ఓరియంటల్ లైబ్రరి, మద్రాసు. |
| 10 | అశ్వ ఫలప్రకాశము | జోగరాజు | మాతృభూమి కార్యాలయము, గ్వాలియర్. |
| 11 | అశ్వలక్షణము | బృహస్పతి | ... |
| 12 | అశ్వలక్షణ శాస్త్రము | శాలిహోత్రముని | ఓరియంటల్ లైబ్రరి, మద్రాసు, మైసూరు. |
| 13 | అశ్వవైద్యకము | దీపంకరుడు | దర్బార్ లైబ్రరి, నేపాలు. |
| 14 | అశ్వవైద్యము | శాలిహోత్రముని | ఓరియంటల్ లైబ్రరి, మైసూరు. |
| 15 | అశ్వశాంతి | నారదుడు | ఓరియంటల్ లైబ్రరీ, మద్రాసు. |
| 16 | అశ్వశాంతి విధానము | శాలిహోత్రముని | సరస్వతీ మహలు, తంజావూరు. |
| 17 | అశ్వశాలాయాం కర్తవ్యక్రమః | తెలియదు | సరస్వతీమహలు, తంజావూరు. |
| 18 | అశ్వశాలిహోత్రమ్ | తెలియదు | బిర్ లైబ్రరి, ఖాట్మండు, నేపాలు. |
| 19 | అశ్వశాస్త్రము | నకులుడు | ఆర్యరసాయనశాల, ముక్త్యాల. |
| 20 | అశ్వశాస్త్రము | రామచంద్రకవి | ఓరియంటల్ లైబ్రరీ, మైసూరు. |
| 21 | అశ్వశాస్త్రము | సుఖానందుడు | ఓరియంటల్ ఇన్స్టిట్యూట్, బరోడా. |
| 22 | అశ్వశాస్త్రము | దయసింహుడు | లాల్‌చంద్ రిసర్చి లైబ్రరి, డి. ఎ. వి. కళాశాల, లాహోరు. |
| 23 | అశ్వశాస్త్రము | రేవంతుడు | అభినవచంద్రుడు తన కన్నడ అశ్వశాస్త్రమున ఈ గ్రంథమును పేర్కొనినాడు. |
| 24 | అశ్వసారము | తెలియదు | ... |
| 25 | అశ్వసారసముచ్చయము | కల్యాణుడు | లక్షణప్రకాశములో ఉదహరింపబడినది. |
| 26 | అశ్వహృదయము | శాలిహోత్రముని | కవీంద్రాచార్య లైబ్రరి, వారణాసి. |
| 27 | అశ్వాయుర్వేదగణవృత్తి | తెలియదు | బిర్ లైబ్రరి, ఖాట్మండు, నేపాలు. |
| 28 | అశ్వాయుర్వేదము | గణుడు | ఓరియంటల్ లైబ్రరి, మద్రాసు. |
| 29 | అశ్వాయుర్వేదము | తెలియదు | గద్వాల సంస్థానము, ఆంధ్రప్రదేశ్. |
| 30 | అశ్వాయుర్వేదము | గర్గఋషి | ... |
| 31 | అశ్వాయుర్వేదము | జయదత్తుడు | లక్షణప్రకాశలో ఉదాహరింపబడినది. |
| 32 | అశ్వాయుర్వేదము | వాగ్భటుడు | భండార్కర్ ఓరియంటల్ రిసర్చి ఇన్స్టిట్యూట్, పూనా. |
| 33 | అశ్వాయుర్వేద సారసంగ్రహము | వాహడ | |
| 34 | అశ్వాయుర్వేద సారసింధువు | మల్లదేవపండితుడు | సరస్వతీ మహలు, తంజావూరు |
| 35 | అశ్వాయుర్వేద సారసింధువు | వైశంపాయనుడు | సరస్వతీ మహలు, తంజావూరు |
| 36 | శాలిహోత్రమ్ | భోజరాజు | ఓరియంటల్ ఇన్స్టిట్యూట్, బరోడా |
| 37 | శాలిహోత్రమ్ | జయదత్తుడు | ఓరియంటల్ ఇన్స్టిట్యూట్, బరోడా |
| 38 | శాలిహోత్రమ్ | విక్రముడు | ఓరియంటల్ ఇన్స్టిట్యూట్, బరోడా |
| 39 | శాలిహోత్రమ్ | తెలియదు | రాజస్థాన్ ఓరియంటల్ రిసర్చి ఇన్స్టిట్యూట్, జోధపూరు |

| క్రమసంఖ్య 1 | గ్రంథనామము 2 | రచయిత 3 | ప్రతి భద్రపరుపబడిన ప్రదేశము లేక ప్రతిని గురించిన వివరములు. 4 |
|---|---|---|---|
| 40 | శాలిహోత్రవ్ | నకులదేవుడు | స్పై ఇన్స్టిట్యూట్, జోధపూరు |
| 41 | శాలిహోత్రసార సంగ్రహము | తెలియదు | బిర్ లైబ్రరి, ఖాట్మండు, నేపాలు |
| 42 | శాలిహోత్రసార సంగ్రహసముచ్చయము | కల్యాణుడు | ప్రాజ్ఞ పాఠశాలా మండలి, వాయ్. |
| 43 | సింధుయోగ సంగ్రహము | శాలిహోత్ర ముని | రఘువంశ (5.73) వ్యాఖ్యానమున మల్లినాథుడు పేర్కొనిన గ్రంథము |
| 44 | హరిహర చతురంగము | గోదావరమిశ్రుడు | ఓరియంటల్ ఇన్స్టిట్యూట్, మైసూరు |
| | **(చ) గజశాస్త్ర గ్రంథములు** | | |
| 45 | గజగ్రహణ ప్రకారము | నారాయణ దీక్షితులు | శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ ప్రాచ్యపరిశోధనాలయము, తిరుపతి. |
| 46 | గజ చికిత్స | పాలకాప్యముని | సరస్వతీమహలు, తంజావూరు. |
| 47 | గజనీరాజన విధి | తెలియదు | ... |
| 48 | గజపరీక్ష | తెలియదు | భండార్కర్ ఓరియంటల్ రిసర్చి ఇన్స్టిట్యూట్, పూనా. |
| 49 | గజప్రశంస | సారంగధరుడు | బిర్ లైబ్రరి, ఖాట్మండు, నేపాలు. |
| 50 | గజలక్షణ చికిత్స | వేదవ్యాసుడు | సరస్వతి మహలు, తంజావూరు. |
| 51 | గజవైద్యము | తెలియదు | సరస్వతి మహలు, తంజావూరు. |
| 52 | గజశాస్త్రము | దినకర కవి | ... |
| 53 | గజశాస్త్రము | వైశంపాయనుడు | సరస్వతి మహలు, తంజావూరు. |
| 54 | గజశాస్త్రము | శరభోజిరాజు | సరస్వతి మహలు, తంజావూరు. |
| 55 | గజాయుర్వేదము | తెలియదు | బిర్ లైబ్రరి, ఖాట్మండు, నేపాలు. |
| 56 | మాతంగ లీల | నీలకంఠ కవి | త్రివేండ్రములో ప్రచురితము. |
| 57 | రాజపుత్రీయము | తెలియదు | రఘువంశ (4.39) వ్యాఖ్యానమున |
| 58 | మృగచర్మీయము | తెలియదు | మల్లినాథునిచే ఉదాహరింపబడినవి. |
| | **(ట) గో వైద్యశాస్త్ర గ్రంథములు** | | |
| 59 | గోరక్ష సంహిత | తెలియదు | అర్వరసాయనశాల, ముక్తేశ్వర్. |
| 60 | గోవైద్యము | కీర్తివర్మ | ... |
| 61 | గోవైద్యశాస్త్రము | తెలియదు | ... |
| 62 | గోశాస్త్రము | తెలియదు | ... |

# వాడు

## కే. ఎస్వీ

వాడెలాంటివాడో తెలుసునాకు. తెలిసే వాడికో స్నేహం చేసేను. నేనెలాంటి వాణ్నో మొదట వాడికి తెలీదు. తెలుసుకుందామని వాడు నాతో స్నేహం చేసేడు ఆ సంగతి నాకు తెలుసు మా ఇద్దరి మధ్యా స్నేహం నిలిచుండాలంటే నేను వాడికి పూర్తిగా ఎప్పుడూ అర్థమైపోకూడదు! మా ఇద్దరి సంగతేకాదు. అసలు స్నేహమంటేనే అది. ఇద్దర్లో కనీసం వొక్కరైనా ఆ ఇంకొకరికి వొక తరహా పజిల్‌గా వుండిపోవాలి. పజిల్ పజిల్‌గా వున్నంతకాలమే ఆసక్తి, పజిల్ సాల్వైపోతే? బస్! అంతవరకూ పజిల్ కనిపించే వైచిత్రి, వొక తరహా గొప్పతనం-నశిస్తుంది. పజిల్‌ని సాల్వ్ చేసిన వాడు-పజిల్‌కంటే తనే గొప్పవాణ్నని అనుకుంటాడు!

నేనొక పజిల్‌నన్న సంగతి వాడికి తెలుసు. నేను వాడికి అర్థంకాను. అర్థంచేసుకోవాలని వాడు ప్రయత్నిస్తాడు. అర్థంకాకూడదని నేను ఏనాడో నిశ్చయించుకున్నాను. నేను వాడికి ఎన్నియుగాలకైనా అర్థం కాను. ఎన్ని యుగాలకైనా మా స్నేహం చెక్కు చెదరదు. నాతో స్నేహంచేసేప్పుడే ఈ సంగతి వాడికి తెలుసు. వాడికి తెలుసనీ నాకు తెలుసు.

నా హృదయం వొక ఆటోమేటిక్ పరికరం. దాని తాళంచెవి దానిలోపలే వుంది. తలుపు మాత్రం నేనే మూసేను. తాళం బిగిసిపోయింది. వున్న వొకేవొక్క తాళంచెవి లోపలే వుండిపోయింది. ఇహ దీన్ని ఎవ్వరూ తెరవలేరు తలుపులకేసి తలకాయలు బద్దలు కొట్టుకున్నాసరే-వూహూం-ఈ తలుపులు తెరుచుకోవు.

నాతో స్నేహమంటే ఏమిటో వాడికి తెలుసు. అమాయకంగా గొర్రెలా వాడు నాతో స్నేహానికి సిద్ధపడ్డాడు.

అమాయకులంటే నాకు అసహ్యం గొర్రెలంటే నాకు అసహ్యం, అందమైన గొర్రెలన్నా అసహ్యమే! అందమైన గాడిదలన్నా అసహ్యమే!

వాడో అందమైన గొర్రె వాడో అందమైన గాడిద.

మరి వాడితో స్నేహానికి ఎందుకు సిద్ధపడాను నేను?

సరే అందుక్కారణా లనేకం! కాని, కారణాలు—వున్నాయి!

నా అంతటి బుద్ధిమంతుడు, నా అంతటి మంచివాడు, నా అంతటి ఉదాత్తుడు, నా అంతటి రసహృదయుడు, నా అంతటి గొప్పవాడు-కారణం లేకుండా వొక గొర్రెతో—వొక గాడిదతో స్నేహం సాగిస్తాడా? అందంవుంటే వుండొచ్చుగాక—నిజానికి గొర్రెలంటే ఎంత అసహ్యమో, గాడిదలంటే ఎంత అసహ్యమో—అందం అంటే కూడా అంత అసహ్యంనాకు. చెప్పలేనంత అసహ్యం! ఆసంగతి ఎప్పుడూ గుర్తు వుంటూనే వుంటుంది నాకు!

లేదు, ప్రగల్భానికి—స్తుతి ప్రగల్భానికి చెప్పకోవడం లేదు నేను, ప్రగల్భానికే అయితే—ఇంకా పెద్దమాటల్నే ఉపయోగించే వాణ్ణి, బుద్ధిమంతుడు, మంచివాడు, ఉదాత్తుణ్ణి, రసహృదయుడు, గొప్పవాడు—ఈ మొదలైన విశేషణాలన్నీ నాకునేను తగిలించుకున్నవికావు. నా జీవితంలో ఏదోవొక సందర్భంలో ఎవరోవొకరు నిండుమనసుతో నాగురించి పలికిన మాటలే! వాళ్ళు అన్నారుకదా అని—నేను బుద్ధిమంతుణ్ణి—గొప్పవాణ్ణి...అయిపోలేదు. పుట్టుకతోనే నాలో ఈ గుణాలన్నీ వున్నాయి. ఎవ్వరూ కనిపెట్టి చెప్పకుండానే ఈ సత్యాన్ని నేను నా ఎరుకలో వుంచుకోగలను.

అయితే—ఇంత మంచివాడికి, ఇంత రసహృదయుడికి, ఇంత గొప్పవాడికి—ఆ అందమైన గాడిదతో స్నేహం చెయ్యాలని ఎందుకు కలిగింది వుద్దేశం??

ప్రపంచానికి కారణాలు కావాలి. పతి చిన్న పనికీ పెద్ద కారణాలుండొచ్చు. ప్రతి పెద్దపనికీ చిన్నచిన్న కారణాలుండొచ్చు. చెప్పనవసరం లేకుండానే బయటపడిపోయేది. అందరికీ తెలిసినా ఎవరికీ తెలిపినట్టు కనిపించనివి, నిజానికి చెప్పకోలేనివి. చెప్పకో కూడనివి. సరే—కారణాలు—నేను చెప్పకోకేం? నేనుచేసే ప్రతి

చిన్న పనివెనుకా పెద్దపెద్ద కారణాలు బోలెడుంటాయి. ఎందుకు చెయ్యాలి ఈపని? అని ఎవరైనా అడిగితే బహుశా నేను సమాధానం చెప్పను, కాని, నా కారణాలు తెలీకుండా నేను ఏపనీ చెయ్యను.

అప్పుడు చండప్రచండమైన ఎండాకాలం, వూళ్ళో ఎక్కడా మంచినీటి చుక్కలేదు. ఇదో కారణం.

అప్పుడు ఆంధ్రోద్యమం వొచ్చింది: జై ఆంధ్రా. జై తెలంగాణా. ఇది రెండోకారణం.

పోలీసు కాల్పుల్లో దిక్కూమొక్కూలేకుండా జనంచచ్చిపోయేరు. మా వూళ్ళో ఫైరింగ్ జరగలేదు కాని సి. ఆర్. పి. దళాల తుపాకీల మోత నా చెవుల్లో అనునిత్యం ప్రతిధ్వనిస్తూనే వుండేది. ఇది మూడో కారణం.

రక్తం రక్తం రక్తం నా కలల్లో చీకట్లో నల్లటి చీకట్లో రక్తం...ఇది ఇంకో కారణం.

రక్తం ఎవరిదో తెలీదు. కాల్పుల్లో బలైన అమాయకుడిదో? ఏమో!

నా మంచితనం, నా బుద్ధిమంతనం, నా రసహృదయం, నా గొప్పతనం...ఇవేవీ ఆ రక్తాన్ని ఆపలేవు. వేస్ట్! నా వనుకుని నేను గర్వించినవన్నీ వేస్ట్! నేను ప్రత్యేకంగా వుండిపోనవసరం లేదు. అందమైన గాడిదలతో నేను స్నేహం చెయ్యొచ్చు. అకారణ ద్వేషం గురించి, తుపాకీల మోతగురించి, అమాయకుల మరణం గురించి, చీకట్లో నల్లటి చీకట్లో రక్తం ఎర్రటి రక్తం గురించి—అన్నిటి గురించి మర్చిపోవచ్చు.

ద్వేషంకన్న, తుపాకీకన్న, మృత్యువుకన్న, చీకట్లో రక్తంకన్న—అందంతో స్నేహం, అందమైన గాడిదతోనైతేనేం—స్నేహం...నయమనుకున్నాను.

అందుకే—వాడితో చేసేను స్నేహం!

ఎవరూ నమ్మరు. ఎవ్వరితోనూ చెప్పలేదు నేను. వాడూ నమ్మడు. వాడితోనూ చెప్పలేదు నేను తెలిస్తే. వాడిబోటి అల్పుడితో నాలాంటి ఉన్నతుడు స్నేహం చెయ్యడానికి కారణం ఇదే!

ప్రపంచ మహా సంగ్రామానికే కాదు-ప్రాంతీయ విభేదాలు కూడా-ఫలితాలంటూ వుండనే వుంటాయి. ఏ చరిత్రకారుడి అందని ఫలితాలు. ఏ చరిత్రకారుడూ వూహించలేని ఫలితాలు!

పూర్తి నిజం చెప్పకపోయినా అబద్ధం చెప్పకుంటే చాలు ఏం? నేను పూర్తి నిజాలూ చెప్తాను.

వాడితో నేను స్నేహం చెయ్యడానికి ఇల్లాంటివే ఎన్నో కారణాలు.

అందంగా వుంటాడు వాడని మొదటవాడికి తెలీదు. వాళ్ళ గొప్పతనం దేశాన్ని ఏ రకంగానూ రక్షించలేనిదని వాడికి తెలీదు. ఏ పని చేసినా అన్నీ తెలిసి చేస్తుంటానవీ వాడికి తెలీదు.

—వాడికి తెలీని ఈ అన్నిటివల్లా వాడంటే నాకు ఇష్టం ఏర్పడింది.

ఇష్టం — నేనే ఏర్పరచుకున్నాను.

అయితే మా ఇద్దరికీ మొదట పరిచయం ఎలా ఏర్పడింది?

ఏమో ఇప్పుడు గుర్తులేదు. ప్రయత్నిస్తే గుర్తు రావొచ్చు. కాని, ఆ అవసరం లేదు.

వాడంటే ఇష్టం ఏర్పరచుకున్నాక, వాడిలో నేనంటే ఇష్టం కలిగించాలనుకున్నాను. కలిగించేసేను

ఎలా?

అదే నా గొప్పతనం.

మోసం కాదు. కపటం లేదు. ఆశలు చూపడం లేదు. అబద్ధాలు చెప్పడం లేదు. అలాంటి హాస్యాస్పదమైన "చిటికెలు" ఏవీ ప్రయోగించలేదు.

కాని, అతణ్ణి జయించేసేను. అతణ్ణే కాదు. ఎవర్నయినా సరే అలాగే జయించగలను. ఆ రహస్యం ఏదో నాకు బాగా తెలుసు.

మనుష్యుల్ని జయించే రహస్యాలు తెలిసినవాళ్ళు కొంతమంది వుండొచ్చు. వాళ్ళందర్నీ జయించే యుక్తులు కూడా నాకు తెలుసు. అటువంటప్పుడు ఈ గొర్రెని జయించడంవొక లెక్కా?

పడిపోయేడు.

గొర్రె నా వళ్లో పడిపోయేడు.

ఏం? స్వార్థమా? లేదే? అతడివల్ల నాకులాభంఅంటు ఏమీ

లేదు అతడిస్నేహంవల్ల నాకుసంఘంలో పరపతిపెరగదు. నా ఆదాయం పెరగదు. నా పేరు ప్రతిష్ఠలు పెరగవు. పోనీ — నా మనసుకైనా ఏదైనా తృప్తి లభిస్తుందా అంటే — అదీ లేదు.

నిజానికి — గౌరెతో స్నేహంవల్ల నేను చాలా నష్టపోతాను.

కాని, అన్నిటికీ సిద్ధపడ్డాను.

ఎందుకు ? — ఓహ్...మళ్లీ కారణాలు ..అవే కారణాలు...

"నువ్వెంతో మంచివాడివి ... నువ్వెంతో ఉత్తముడివి ... నీదెంతో మెత్తటి మనసు..."

అంటూ మొదలుపెట్టేడు వాడు.

నాకు తెలుసు వాడు ఆ మాటల్ని అప్పుడు హృదయపూర్వకంగానే అన్నాడు.

మొహమాటానికి ఇబ్బందిగా ముఖంపెట్టి ఆ మాటల్ని విన్నాను గాని, లోపల్లోపలే నవ్వుకున్నాను నేను.

ఫూల్ ! — అందమైన ఫూల్ ! నా అంచనా ప్రకారం నా వలలో కేవలం నేననుకున్నట్టుగానే పడిపోయేడు...

ఓ ! ... వర్ణించడం అంటే నాకు అసహ్యం ! నాకు నేను వర్ణించుకోవడమంటే కూడా అసహ్యం !

కాని, మా పరిచయం గాఢ స్నేహంగా పెనవేసుకుంటూన్న ఆ రోజుల్లో వాడి అందమైన ముఖంలో ఎంతో అమాయకత్వం కదలాడేది.

రోజూ వెళ్ళి నేను వాణ్ని కలుసుకునేవాణ్ని.
సాయంత్రం సాయంత్రం వెళ్ళేవాణ్ని.
నేను వెళ్ళేవేళకి సరిగా కిటికీనుంచి చూస్తూవుండి నేను వచ్చీరాగానే ముఖంలో ఆనందరేఖలు చిమ్ముతుండగా — 'వొచ్చేవా !' అనేవాడు వాడు.

వాడేం మాట్లేడోవాడో వాడికి తెలీదు. వాడే, మాట్లాడబోయి వేరే ఏం మాట్లాడేవాడో నాకు తెలుసు. వాణ్నిగురించి వాడికీ తెలీని రహస్యాల్ని ఎప్పటికప్పుడు పరిశీలిస్తూ పరిశోధిస్తూ వుండేవాణ్ని !

"వొచ్చేవా !" అని నేను రాగానే అనేవాడు వాడు.

ఆ మాట నాకోసం అనాలి ఎవరో వొకరనాలి రోజూ అనాలి, నాకోసం రోజంతా ఎదురు చూసినట్టు, వాళ్ళ నిరీక్షణకు తెరదింపజేస్తూ నేను ప్రత్యక్షమైనట్టు — "వచ్చేవా !..." ఆ మాట ... అమాటే... కావాలి నాకు.

రోజుకోసారైనా ఆమాట వినకపోతే బ్రతకలేను.
స్నేహరాక్షసుణ్ని నేను.
పాపం, వాడికిగి తెలీదు.

సాయింత్రం ముగిసి, దీపాలు వెలిగి, చెట్లు గుసగుసగా నీడల సైగలతో పూలనిట్టూర్పులతో మాటాడుకునే వేళ ... "ఇంతే వెళ్తాను —" అంటూ వాడినుంచి శెలవు తీసుకునేవాణ్ని. నేను నిష్క్రమించబోతుండగా —

"మళ్ళీ ఎప్పుడు ?—" అనేవాడు.
ఆ మాట — అమాటే —
నా కోసమే తను బతుకుతున్నట్టు — నన్ను కలుసుకోవడంలోనే తన జీవిత పరమావధి వున్నట్టు — ఎన్నిసార్లు నాతో కాలం గడిపినా తనివి తీరనట్టు — "మళ్ళీ ఎప్పుడు ?—"

రాక్షసుణ్ని — స్నేహరాక్షసుణ్ని నేను !
ఏమీ తెలీదు వాడికి, గౌరె, గాడిద
స్నేహమనే కల్లు తాగించేను వాడిచేత.
నాక్కావలసినమాటలు వాడినోటంట పలికించుకున్నాను —
"వచ్చేవా ?—" "మళ్ళీ ఎప్పుడు ?-"
ఆ మాటల విలువ వినే నాకు తెలుసుగాని — మాట్లాడే వాడికి తెలీదు !

సరే — వాడు పూర్తిగా నావశం అయిపోయేడు !
మందూ మాకూ లేదు. మంత్రం తంత్రం లేదు.
మనసుందిరా నా దగ్గర — అని మౌనంగా సైగచేసేను.
పేరాశతో వొచ్చేడు. కూరుకుపోయేడు.
"మాట్లాడు - ఏదైనా మాట్లాడు..."
అని నన్నుతొందరచేసేవాడు
వాడికోసం ఏదైనా వొకటి మాట్లాడాలి నేను.
"ఏం మాటాడను ?—"
"ఏమైనా సరే ! ..."
"ఏమైనా సరే - అంటే ! ?—"

"ఏమైనా సరే - మాట్లాడు...ప్లీజ్ ! ."

"ఏమిటో అంత అవసరం ?—"

"నువ్వు మాట్లాడుతుంటే వినాలనుంది —"

"విడ్డూరం నా మాటల్లో ఏముంది ?—"

"ఏమో — తెలీదు — నీగొంతులో సంగీతం వుంది. నాకర్థం కాదు. కాని వినాలనుంది. మాట్లాడు, శిక్షమైంది మాటాడు. ఏమీ తోచకపోతే — నన్ను తిట్టు ... ప్లీజ్ !... నన్ను తిట్టు —"

లోపల్లోపలే నవ్వుకునేవాణ్ని.

నానాటికీ నాశక్తి నాకే తెలిసి వచ్చింది.

మగవాళ్ళు మగవాళ్ళను ప్రేమించడం సాధ్యమా ? మగవాళ్ళు మగవాళ్ళచేత ప్రేమింపజేసుకోవడం శక్యమా ?—

సాధ్యమే ! శక్యమే !

నావంటి గొప్పవాడికి అసాధ్యంలేదు. అశక్యంలేదు.

"వొద్దు. చూడు. నాలో ప్రత్యేకతేమీలేదు. నామీద ఇంత ఇష్టం పెంచుకోవొద్దు. తరువాత కష్టపడతావు —" అనేవాణ్ని,

అన్నానని అనడం వేరు.

ఆ మాటల్ని నా అద్భుతమైన గొంతుతో, హృదయాన్నీ ఆత్మావేశాన్నీ రంగరిస్తూ పలకడం వేరు.

వూహూ— నటించలేదు నేను.

నటన చాతనౌను. కాని నటించలేదు. అవసరంలేదు. అవసరమున్నా నేను నటించను.

నటించని నటుణ్ని !

— అట్లా నేను మాట్లాడితే మరీ కరిగిపోయ్యేవాడు వాడు.

"ఎందు కిటా అబద్ధాలు చెప్తావు,? మొహమాటాని హద్దులున్నాయి. నువ్వు అందరిలాంటి వాడివి కావు. నువ్వో ప్రత్యేకమైన మనిషివి. అందరికంటే మంచివాడివి..."

"నా చెడ్డ ఎవరికి తెలుసు ? —"

"నీలో చెడ్డ లేదని నాకు తెలుసు—"

"ఎలా తెలుసు ? — ఋజువు ?"

"ఋజువులేకుండా నమ్మలేను..."

అలాగే నమ్మేడు నన్ను.

నేనో హెమ్లెట్‌ని. రస్కాల్నికోవ్‌ని, జాన్ క్రిస్టోఫేని, సుబ్రమణ్యం నవలో రాముణ్ని, దయానిధిని అలజీవి సుబ్బయ్యని. నేనే కృష్ణపక్షాన్ని. కిన్నెరసాని జాతిని.

ఓహో ! ఎంత కవిత్వం ! ఎంత కవిత్వం !!

నా జీవితం వొక గొప్ప పద్యం !

ఎంతో కవిత్వం మాట్లాడేను వాడితో నేను, వాడితో మాట్లాడే మిషమీద నాతో నేను మాట్లాడుకున్నాను.

వాడుట్టి శ్రోతగా ప్రేక్షకుడుగా వుంటూ — తనని తాను మరిచిపోయేడు.

నా కవిత్వంతో నా హృదయంతో చిత్తశుద్ధిలో నా జీవిత విషాదంలో — వాణ్ని కొల్లగొట్టేసేన్నేను.

నామటుకు నేనుమాత్రం ఏమీ యెరుగనివాళ్లావుండిపోయేను.

ఏం ? ఏముంది చెప్పకోవడానికి ? ... ...

నాతో నేను చెప్పకోడానికి మాత్రం?......

అవును, వాడు అందమైనవాడు. చాలా అందమైనవాడు.

అందమైనవాళ్ళంటే అసహ్యం నాకు.

కాని, వాడి అందాన్ని క్షమించేసేన్నేను. పటించుకోలేదు.

ఎర్రగా వుండేవాడు. సన్నగా వున్నా ఆరోగ్యంగా వుండేవాడు. కోల ముఖం, తేట కళ్ళు. గీసిన ముక్కు, కత్తించిపెట్టిన పెదవులు, వొంపున్న గెడ్డం, నుదుటిమీదికొచ్చిపడే జుత్తు —

వూహూ — వర్ణన నాకు చాతకాదు.

కాని వాడు అందమైనవాడే !

తెల్లటి వాడి కళ్లలో ఎంతో అమాయకత్వం ఉత్సాహం క్యూరియాసిటీ వుండేవి !

ఓహో ! ఇలా వుంటుందా ప్రపంచం అంటే ? నే నింకా ఏమో అనుకున్నాను — అంటున్నట్టుండేవి ఆ చూపులు.

ఏ మనిషిని వర్ణించాల్సివచ్చినా ప్రత్యేకంగా అతడికళ్ళని వర్ణిస్తారు కవులూ రచయితలూ, మనుషుల్ని చిత్రిస్తే — చిత్రించ దలచిన మనిషి స్వభావాన్ని కళ్ళలో నిక్షేపించాలని ప్రయత్నిస్తారు చిత్రకారులు

మనిసి వ్యక్తిత్వం అంతా అతడికళ్ళలో బైటపడుతుందని నాకు తెలుసు

వాడి కళ్ళలోంచి బైటపడే వాడి వ్యక్తిత్వం చూసి నవ్వుగా నవ్వుకునేవాణ్ణి.

అది చాలా అందమైన వ్యక్తిత్వం అయితే అందులో లోతు లేదు అందులో శక్తిలేదు. ఆ అందం జ్ఞానంవల్ల వచ్చే 'సౌందర్యం' కాదు అది వయసు తెచ్చే పైపై అందం.

సిన్సియర్‌గా ఆలోచించడం నా వస్తేకత

ఔను. వాడికళ్ళు నాకు ఖచ్చితంగా గాడిదకళ్ళనే గుర్తు తెచ్చేవి

ఏమీతెలీదు ఏమీ తెలీదువాడికి అమాయకుడు అర్భకుడు అందమైనవాడే — అంటే — అందంగా ఇతరులకి కనిపించేవాడే — కాని అందం అంటే ఏమిటో కూడా తెలీనివాడు.

నువ్వు సాధ్యమైనంత వికారంగా వుండు కాని కొంచెం నీ సొంతతెలివి కనబరుస్తూ నువ్వంటే నేనిష్టపడతాను...అని వాడికి చెప్పలేదు నేను

ఎందుకంటే వాడికి సొంత తెలివంటే తెలీదు!

వాడికంటే నేను అందంగా ఎవరికి కనిపించేవాణ్ణి కాను — వొక్క వాడికి తప్ప!...

"నిన్ను పెళ్ళిచేసుకునే ఆడపిల్ల ఎవరోగాని — ఎంత అదృష్టవంతురాలు!..." అనేవాడు ఎన్నోసార్లు.

ఛీ! — నేనెంత వికారంగా వుంటాను!—" అనేవాణ్ణి!

"ఎవరంటారలా? ఇలా రమ్మను నేను చెప్తాను ... నీకేం? అచ్చు మొగాడిలా వుంటావు —"

నేను హా — మేన్‌సవే సంగతి (?) వాడునాకు జ్ఞాపకం చెయ్యనవసరం అంటే లేకపోయినా — వాడినోటంట ఆ మాట చెప్పించుకుని నవ్వుకునేవాణ్ణి!

వాడి అందం అంటే నాకు అసహ్యం! నిర్లక్ష్యం!!

నా వికారం అంటేనే వాడికి ఇష్టం!

"జీవితంలో వుండే పేరడాక్స్‌ల్లో మన స్నేహం వొకటేమో!..." అనేవాణ్ణి వాడితో!

అటువంటి మాటలు నా నోటంట వినలేకపోయేవాడు.

"అలా అనకు. నా జీవితంలో మరపు రాని ఘట్టం — నీతో పరిచయం నీ పరిచయంవల్ల నా మనసుకి ఆసరా దొరికింది. ఎంత అదృష్టవంతుణ్ణి నేను! నా అదృష్టానికి వొక్కోసారి నాకే ఈర్ష్య కలుగుతుంది ... ఇంతటి అదృష్టానికి పూర్వజన్మలో నేనెంత పుణ్యం చేసుకుని వుండాలో అనేవాడు—"

వాడలా మాట్లాడేకొద్దీ నేను వాణ్ణి మరీ మరీ పూరించేవాణ్ణి. వొక్కోసారి కావాలనే వాడి దగ్గరికెళ్ళడం మానేసేవాణ్ణి. మరుసటి దినం పొద్దెక్కేసరికి వాడు కళ్ళనీళ్ళ పర్యంతం అయిపోయేవాడు —

"వచ్చేవా? ఈ పూట కూడా వొస్తావో రావో అనుకున్నాను— ఏం — నిన్నంతా రాలేదేం? సాయంత్రమంతా ఎదురుచూసేను. నువ్వు రాకుండానే సాయంత్రం రాత్రయిపోయింది. ఏదో అవసరమైన పనుండి రావడం మానేసేవనుకున్నాను. అయినా ఏమో— వొస్తావేమో అని అర్ధరాత్రి దాకా ఎదురుచూస్తూనే వున్నాను ... ఏం? ఎందుకు రాలేదు నిన్న?—'

లోపలే నవ్వుకునేవాణ్ణి.

రాకపోయినందుకు అబద్ధాలూ కుంటిసాకులూ చెప్పేవాణ్ణి కాదు.

"రోజూ వస్తే ఇష్టం నిదురలేదూ" అనేవాణ్ణి.

"ఆ మాట అనకు కావలిస్తే — నీకోసం నేను చచ్చిపోతాను — నీమీద ఇష్టం పోతే ఇహ నేను బ్రతకవవసరంలేదు—" అనేవాడు, ఆ బేలకళ్ళతో చూస్తూ

వట్టి మూర్ఖుడి కళ్ళు లోతులేని కళ్ళు.

బల పరుపు కళ్ళు, బల పరుపు చూపులు.

వొక్కోసారి వూరెళ్ళి అతను రాసే వుత్తరాలు వింతవింతగా వుండి నాకు విపరీతంగా నవ్వు తెప్పించేది ... ...

"... ... నీతో పరిచయానికి పూర్వజన్మలో ఎంత పుణ్యం చేసుకుని వుండాలో అనుకున్నాను ఇన్నాళ్ళూ. ఇలాంటి పరిచయాన్నికైతే పుణ్యం కాదు పాపం చేసుకుని వుంటాననిపిస్తోందిప్పుడు..."

ఏం? నేనో ఆడపిల్లగా ఎందుకు పుట్టకూడదూ?

చుక్కలు నిండిన ఆకాశం కింద ఇసుకలో కూచుని వి వ...

కలపెట్టుకుని — గంభీరంగా నువ్వు మాట్లాడుతుండగా వింటూ వుండడానికి — ఏ ఆడపిల్ల ఎంత పుణ్యం చేసుకుందో!

ఆ ఆడపిల్లని నేనే ఎందుక్కాకూడదూ? ఎంత దురదృష్టవంతుణ్ణి నేను! ఎంత దురదృష్టవంతుణి!!

పెళ్ళి చేసుకోవద్దని నిన్ను అడగలేదు. అడగను. ప్రకృతి విరుద్ధమైన కోరిక నేనుమాత్రం ఎలా కోరుకోను! నేను ఆడపిల్లగా పుట్టకపోయిన నా దురదృష్టానికి మాత్రం నేను ఖేదించని క్షణం లేదు

"అంతా నీకోసమే! నీ కోసమే! ......"

హోమోసెక్సువల్స్ అని భ్రమపడేదాకా వృద్ధిచెందింది మా స్నేహం.

నాకోసం వాడు పిచ్చివాడైపోయేడు. తన సమస్యలన్నీ నాతోనే చర్చించేవాడు. నేను చెప్తేనే ఏదైనా చేసేవాడు. నాకేమ్మాత్రం ఇష్టంలేదని తెలిసినా మానేసేవాడు.

ఒకవంక నాకు విసుగెత్తడం ప్రారంభమైంది. వూహూ — నా సరదాకి — నాకాలం కొంచెం వినోదాత్మకంగా గడిచేందుకు — ఈ హృదయనాటకం మొదలుపెట్టేను.

మొదలైన ప్రతిదీ ఎప్పుడో ఒకప్పుడు ఆఖరవక తప్పదు.

తెరవాలక తప్పదు. కథ ముగియక తప్పదు.

కాని, ఆరంభమైతే నా చేతుల్లో వుంది. ముగింపు వాడి చేతుల్లోనే! ఎప్పుడు ముగించాలో తెలుసు. అయినా, వాడిచేత ముగింప జేసుకోవడంలో కదూ వుంది నా ప్రజ్ఞ!

అసహ్యం! అసహ్యం! వాడంటే ఒకవంక అసహ్యం నాలో రోజురోజుకి పెరిగిపోతోంది. వాడి అమాయకత్వాన్ని వాడి అజ్ఞానాన్ని భరించలేకపోతున్నాను. నేనేదైనా చెప్తున్నప్పుడు నోరు కొంచెంగా తెరుచుకుని వినేవాడి భంగిమ నాలో అసహనాన్ని రేపుతోంది.

"మూర్ఖుడా! లే!— వెళ్ళిపో! పారిపో!— నువ్వు దద్దమ్మవి —" అని గట్టిగా అరిచి చెప్పాలనిపించింది.

అతిప్రయత్నంమీద నన్ను నేను అదుపులో పెట్టుకుంటున్నాను.

వాణ్ణి తప్పించుకు తిరగాలని ఎన్నో ప్రయత్నాలు చేసేను. గనునించలేదువాడు. వెంటబడేవాడు. "ఏమిటలావున్నావ్? చెప్పవూ? నాకు చెప్పవూ?—" అంటూ ఆరాలు తీసేవాడు.

వాడికి అందకుండా సమాధానాలు చెప్పి తప్పించుకునేవాణ్ణి!

వాడు నా గురించి యాతనలు అనుభవిస్తూండగా — "పోనీలే — విసుగెత్తి వాడు నన్ను కలుసుకోవడం మానేస్తాడు—" అనుకునేవాణ్ణి. నా అంచనా తప్పవుతుందనీ నాకు తెలుసు.

పజిల్ అర్థంకాక పోయేసరికి వాడిలో ఆసక్తి మరీ అధికం అయిందేగాని, తగ్గలేదు. "ఏమిటీ మనిషి "ఏమిటీ మనిషి!" అని నా గురించి బుర్రబద్దలు కొట్టుకునేవాడు.

ఎంత బుద్ధిమంతుడికైనా ఎంతటి తెలివైనవాడికైనా ఎంతటి గొప్పవాడికైనా— ఒక్కోసారి స్ఖాలిత్యాలు తప్పవంటారు. నిజమే కాబోలు!

వాణ్ణి ఫూల్ చేస్తున్నాననుకున్నాను. ఒకవంక నేనూ ఫూల్ ఔతూనే వున్నాను.

అయితే — నాకు తెలిసే నేను ఫూలయ్యేను గాన్ని, తెలీకుండా కాదు.

నన్ను నేనే ఫూల్ చేసుకున్నాను. అదే నాకు ఇష్టం అనిపించింది. అందులో కూడా ఏదో ఆనందం కనుపించింది.

జీవితంలో నష్టపోయేను. అయినవాళ్లని వదులుకున్నాను. మనస్సైన వాళ్ళను కించపరిచేను. నా భవిష్యత్తుతో నేనే వింత వింత ప్రయోగాలు చేసుకున్నాను.

లాభనష్టాలు బేరీజు వెయ్యడానికి జీవితం వ్యాపారం కాదు— అని నాకు నేనే నర్దిచెప్పుకున్నాను.

వ్యక్తిగతంగా నేను నష్టపోయిన వీటన్నిటికి కారణం వాడెలా ఔతాడు? కాదు!

నేను గొప్పవాణ్ణి!

నష్టపోదలచుకుంటాను, నష్టపోతాను. అంతా నా చేతుల్లో వుంది.

ఈ మాటే వాడితో అంటే పొపుకునేవాడుకాదు.

"లేదు — నువ్విలా అయిపోకూడదు—నువ్వు బాగుపడాలి—" అనేవాడు.

ఇక్కణ్ణుంచి ఏం జరుగుతుందో నాకు తెలిసిపోయింది. నేను బాగుపడాల్సిన సంగతి వాడు గుర్తుచేస్తున్నాడు. వాడి పజిల్‌ని నేను. నేనెలా వుండాలో వాడు నిర్ణయించడం ఏమిటి ?

ఇహ — వాడి సంగతి —

వాడి సంగతికేం ?

దివ్యంగా సాగిపోనారంభించింది. పరీక్షలు పాసయ్యేడు. జీవితంలో బాగుపడ్డాడు. నలుగుర్లోను మంచిపేరొచ్చింది. ఇద్దరు ముగ్గురు ఆడపిల్లలు అతణ్ణి పెళ్ళిచేసుకోవడానికి ఇష్టపడుతున్నట్లు చూచాయగా తెలిసొచ్చింది. అంత కట్నం ఇస్తాం, ఇంత కట్నం ఇస్తాం అంటూ వాళ్ల బంధువుల్లోంచి సమ్మంధాలు రాసాగినై.

అంతే !

వారం రోజుల్లో వాడు మారిపోయేడు.

నేనేదో పనిమీద రాష్ట్రాంతరం వెళ్ళేను.

తిరిగొచ్చి అలవాటుగా వాణ్ణి కలుసుకునేందుకు వెళ్ళేసరికి ఓహ్!— అతంలో, చెప్పలేనంత మార్పు కనిపించింది.

ఘోరమైన మార్పు, విచిత్రమైన భయంకరమైన మార్పు— కొట్టొచ్చినట్టు కరవొచ్చినట్టు కనిపిస్తోంది

"ఓ !–నువా! కమాన్!రా!రా!–" అని నన్ను ఆహ్వానించేడు. "బాగున్నావా ?—" అంటూ కుశలప్రశ్నలు వేసేడు.

బస్ !

తెలిసిపోయింది. వాడికీ నాకూ మధ్య ఏర్పడిన అగాధం నాకు వెంటనే స్ఫురించింది.

"వచ్చేవా !"- అనేవాడు మునుపు. ఆ ఆమాయకత్వం లేదిప్పుడు. ఆ దయ, ఆ నిరీక్షణ, ఆ ఆత్మీయత— అన్నీ నశించిపోయేయి. లోకజ్ఞుడిలాగా వ్యవహరిస్తున్నాడు. బాగానేవుంది. కాని, వాడగ్గరా వాడి లోకజ్ఞత ! ?

అంతటితో ఆగిపోలేదు. వాడు నాకు లెక్చెర్లివ్వడం మొదలుపెట్టేడు. హాస్యాలాడడం మొదలుపెట్టేడు. నీతులు చెప్పడం, సలహాలివ్వడం మొదలుపెట్టేడు. ఇవన్నీ వాడెందుకు చెయ్యకూడదూ ? చెయ్యొచ్చు! వాడెందుకు ఎదగ కూడదూ? ఎదగొచ్చు! కాని—అది ఎదుగుదలకాదు—నిజమైన ఎదుగుదల కానేకాదు. "నేను ఎదిగేను. నీలా ఎదిగేను. నీకన్నా ఎదిగేను. నేను నీ అంతటివాణ్నే కాను. నీకంటే ఎక్కువ వాణ్ణి–" అని చెప్పుకోవాలని లోలోపట్నుంచి ఆరాటం. అవును, అర్భకుడు—నిజంగా ఎదగలేదు వాడు. ఎదిగితే అలా ఆరాటపడిపోవాల్సిన అవసరం లేదు. ఆరాట పడడంలో తన అల్పత్వాన్ని తానే బైట పెట్టుకున్నాడు.

సరే పోనీ అనుకున్నాను మొదట. పట్టించుకోలేదు. పట్టించుకోకపోవడం నాకు అలవాటే. ఎప్పట్లా మా తం వాడిని కలుస్తూ వుండేవాణ్ని.

పరిస్థితి అలాగే కొనసాగివుంటే పాపం–గొర్రె– బాగుండేవాడు: కాని, చెరుపుకున్నాడు. వూరుకుని వుండాలి నవాడు వూరుకోలేదు. చెలరేగేడు. అందరికీ వాడో పెద్ద. వాడోగొప్ప. అందరూ వాణ్ణి అంత వాడింతవాడంటారు. దాంతో వాడికి కళ్ళు కనిపించడం చెవులు వినిపించడం మానేసేయి. వాణ్ని నేను పొగడలేదు. "ఓహో! ఎన్ని సాధించేవు నువ్వు!" అనలేదు. ఎందుకనలేదు ? నిజానికి వాడు ఏమీ సాధించలేదు గనక ! కాని, వాడిది గుర్తించలేదు. ఎందుకు గుర్తిస్తాడూ ? గొర్రె—గాడిద—ఎలా గుర్తిస్తుంది ??

నా గుర్తింపు కావాలి వాడికి ! ఆసంగతి నాకు తెలిసింది.

నలుగుర్తోపాటు నేనూ వాణ్ణి—",ఓహో !—నువ్వెంత గొప్పవాడివి" అనాలి !—అందుకోసం వాడు పడే తహతహ అర్థమైంది.

బిగిసి కూచున్నాన్నేను. నాతో మునుపటిలా మాట్లాడలేక; మాట్లాడకుండా వుండలేక—లోపల్లోపలే గిలగిల్లాడిపోయేడు వాడు.

వాడు గిలగిల్లాడిపోవడం చూచి నేను అంతరాంతరాల్లో ఎంతో సంతోషించే వాణ్ని !!

రావణాసురుడి లాంటి వాణ్ణినేను. రాక్షసుణ్ణి. స్నేహ రాక్షసుణ్ణి.

ఒకప్పుడు నాకోసం ప్రాణం ఇస్తానన్నాడు వాడు. వాడి ముందిప్పుడు నేను చులకనై పోయేను. ఎలా సహించగలను దీన్ని ?

సహించలేను !

"కాదు. నీ మంచికి చెప్తున్నాను—నా మనసుతో ఆడుకో వద్దు"—అని వాడికి రెండుమూడు వుత్తరాలు రాసేను.

వుత్తరాలు అందుకున్న రెండుమూడు రోజులు మాత్రం కొంచెం మామూలుగా ప్రవర్తించేవాడు.

కాని, తరువాత మళ్ళీ చెలరేగిపోయేవాడు.

ముఖ్యం—నాలుగురైదుగురు స్నేహితుల మధ్య వున్నప్పుడు—నన్ను—ఏదో రకంగా కించపరచాలని చూసేవాడు.

మాటల్తో కొట్టాలనుకునేవాడు.

"చూడు—ఆ ముఖంకేసిచూడు—ఎంత శుభ్రంగా వుందో!—" అని నాగురించి నీచంగా మాట్లాడేవాడు, "నువ్వు—నాకన్నా తెలివైన వాడివా ?—" అని, సరదాగా అంటున్నట్టే అనేవాడు— "ఏం ? ఎందుకు ?—నువ్వేం ఆకాశం నుంచి వూడిపడ్డావా ?—" అని మాట వరసకి—పంతానికి అంటున్నట్టుగా అనేవాడు.

కాని, ఆమాటల అసలుధ్వని అందిందినాకు, అమాయకుడు. పిరికివాడు. నాతో నేరుగా అనే ధైర్యంలేదు. నలుగుర్లోవున్నప్పుడే ధైర్యం. పాపం, అనకూడదని అనుకుంటాడు. అనకుండా వుండనూలేడు. బైటపడిపోతాడు గొర్రె, గాడిద బుద్ధి బైటపడి పోతుంది.

వాడా మాటలు అంటూండగా నా పిడికిళ్ళు అప్రయత్నంగా బిగుసుకు పోయేవి నా గుండెలు అతివేగంగా కొట్టుకునేవి. నాలో రోషం బుసలు కొట్టేది.

"బుద్ధిహీనుడా ! మాటాడకు ! ఇవాళ నీ బ్రతుకు—వొకప్పుడు నేను నీకు పెట్టిన భిక్షం ! నాకు నేను గౌణకుంటూండగా విని—మాట్లాడ్డమంటే ఏమిటో తెలుసుకున్నావు నువ్వు షటప్ !— యూ ఫూల్ !—" అని అరవాలనిపించేది.

ఆవేశాన్ని అదుపులో పెట్టుకునేవాణ్ని.

అతి ప్రయత్నంమీద, అతి ప్రయాసమీద.

వాడితో కలవడం నా అంతకు నేను మానుకోవాలి. కాని, వూహూ అది వోటమి అవుతుంది. వాడిలోనేను భీరువును కాను.

కాని, ఈ పోరాటం ఎంతకాలం సాగుతుందో—అనుకున్నాను

అన్నటికీ సిద్ధంగా వున్నానేను. ఔను, అదే ఔన్నత్యం ! !

నా మనసులో జరుగుతున్నదంతా వాడికి ఎప్పటి కప్పుడ తెలుస్తూనే వుంటుందనీ, తెలిసి తెలిసీ వాడు నా మనసుమీద దెబ్బ కొట్టడానికి ప్రయత్నిస్తున్నాడనీ, లేని ఆధిక్యతను నిరూపించుకో జూస్తున్నాడనీ తేట తెల్లంగా తెలిసినా—మునుపట్లాగే మసులుతూ వున్నానేను వాడితో.

వొంటరిగా వున్నప్పుడు మాత్రం నాతో మామూలుగా—మునపటి లాగానే వుండేవాడు. మునుపటిలా నన్ను మాట్లాడమనేవాడ కాదు. నేను మాట్లాడితే ప్రత్యేక శ్రద్ధ కనబర్చేవాడు కాదు మెదలకుండా వినేవాడు. అంతే !

ఆ మౌనం నన్ను మరీ మరీ బాధించ సాగింది.

నవ్వుతున్నాడు లోపల నవ్వుతున్నాడు వాడని తెలిసిపోయింది

"మునుపు నేను వాణ్ని చూసి వాడికి తెలీకుండా లోపలే నవ్వుకునేవాణ్ని !

ఇప్పుడు వాడు నన్నుచూసి లోపల నవ్వుకుంటున్న నవ్వు నాకు సుళువుగా తెలిసిపోతోంది.

ఒకసారెందుకో — నాకో వింత బుద్ధి కలిగింది. యథాలాపంగా మాటల సందర్భంలో — "—ఏమైనా నువ్విప్పుడు పెద్ద వాడివికదా !-" అన్నాను !

సామ్రాజ్యాలు జయించినంత గర్వం వాడిముఖంలో మెరిసింది. ఎంతదాచినా దాగకుండా నన్నుటినవ్వు వాడిపెదవులమీద పాకింది !

తెలివి కళ్లతో ఇదంతా గమనించేను నేను, పైకి మామూలుగా వున్నాను.

"అరె — నేనేం పెద్దవాణ్ని ! —" అన్నాడు వాడు మొప మాటానికి, అంటూ నాకేసి వోరగా చూసేడు.

కళ్లు తిరిగిపోయేయి నాకు.

భయంకరం ! ఘోరం ! క్రూరం ! క్రూరం !

అతని కళ్ళు — మారిపోయేయి !

విచిత్రంగా — నమ్మలేనంతగా — అసహ్యాకరంగా — జుగుప్స కలిగిస్తున్నాయి —

ఆ గోరెకళ్ళు — ఆ లోతులేని గాడిదకళ్ళు — ఎంతగా మారిపోయేయి !!

గమనించనేలేదు నేనంతకు ముందెప్పుడూ ?

తెల్లగా కనుగుడ్లు — నల్లగా అమాయకంగా కనుపాపలు — పాకశిష్యుడలా వుండేవి —

ప్పుడు —

దారుణం ! దారుణం ! దారుణం !!

తేరగా చూసిన ఆ కనుగుడ్లలో తెలుపు — విరిగిన పాలలా వుంది.

ఆ కనుపాపలో అమాయకత్వంలేదు. దానిస్థానంలో —ఏదో— పచ్చగా — ఎర్రజీరలుగా — విషపుకాతాలు కాచేచెట్లు కొమ్మల పచ్చదనంలాగా —

ఏమిటది — ఏమటది —

ఒక్కసారిగా వణికిపోయేన్నేను — తెలిసిపోయింది నాకు —

విషం! ఆ కళ్ళలో నిండింది — విషం !

పచ్చి విషం !

నా ఒళ్ళంతా తేళ్ళు జెర్రులూ నాకలల్లో చీకట్లో ముళ్ళూ రాళ్ళూ —

కళ్ళుకాదు — వాటిపేరు కుళ్ళు !!...

అలా కలలుగంటూ కలల్లో కుళ్ళులో యుద్ధం చెయ్యలేక అలిసిపోతూ వున్నా నాఅంతరంగంలోకి ఎలా వొచ్చిందో — ఎప్పుడొచ్చిందో — ఒకకోరిక అతి రహస్యంగా వొచ్చి బలంగా తిష్ఠవేసింది.

నా ప్రమేయంలేదు నా సంకల్పంలేదు నాకు చాలా దివాల వరకూ తెలీనే తెలీదు — అలాంటి కోరిక నాలోపుట్టిందని,

ఒకసారి ఒక పెద్దపార్టీలో వాడు నాగురించి అసహ్యంగా ఏవో మాట్లాడుతూండగా విన్నాను. "కాక్ వాడు, చెడ్డ సుపీరియారిటీగాడు—" అని నాగురించే అనడం గమనించేను. నా శరీరం నావశం తప్పింది. "స్టుపిడ్ ! నిన్ను చంపేస్తాను —" అని వాడిమీదకు వెళ్ళబోయేను. అంతలో ఏమైందో — కళ్ళు తిరిగినట్టనిపించి, కూచున్న కుర్చీలో అలాగే ఒరిగిపోయేను.

నాలో చాలారోజులుగా గూడుకట్టుకున్న ఆ దారుణమైన కోరికగురించి అప్పుడే నాకు తొలిసారిగా తెలిసొచ్చింది.

వొద్దు వొద్దనుకున్నా—ఎన్నిరకాలుగా ఆ ఆచన తప్పించుకుందామనుకున్నా— వూహూ — వీలుపడలేదు. ఆ కోరిక నాలోంచి రూపుమాసిపోలేదు.

వచ్చటి వాడిమెడ చూసినప్పుడల్లా నాచేతివేళ్ళు జిల జిలగా పీకేవి. వయొలిన్ డొక్కులాంటి వాడిఛాతికేసి చూసినప్పుడల్లా నా పిడికిళ్ళు బిగుసుకునేవి.

వాడు స్నేహితుల్తో వున్నప్పుడలా — వెనకవాటుగా వెళ్ళి ఏ కాలిగుండో తీసుకుని తలబద్దలు కొట్టెయ్యాలనిపించేది

ఆ విషపుకళ్ళలో చూస్తూ విషంనవ్వు నవ్వినప్పుడల్లా పట్టరాని ఆవేశంతో వూగిపోయేవాణ్ని.

నేను కళాకారుణ్ణి. ఏదిచేసినా కళాత్మకంగా చేస్తాను. వాడికి బుద్ధిచెప్పినా — వాడిపీక నొక్కేసినా — కళాత్మకంగానే...

అదంతా అలావుండగా నిన్నటికి నిన్న ఆఖరితప్పు చేసేసేడు వాడు. సాయంత్రం ఆరున్నరకీ ఐదుమంది స్నేహితులమధ్య నన్ను ఎగతాళిచేసి వెకిలిగా నవ్వేడు — "పేద నువ్వేం ఆకాశంనుంచి వూడిపడ్డావా ?— సైకాలజీ మాట్లాడతావు — బోడిసైకాలజీ!... ఇక్కడున్న వాళ్ళందరికన్నా — నువ్వు దేంట్లో గొప్ప!?" అన్నాడు. అనేసేడు. అంతే !

వాడి మాటలు కాదు. వాడిమాటల నిజానిజాలు కాదు.

తొలిరోజుల్లో వాడు మాట్లాడిన మాటలతో ఈ మాటల్ని పోల్చికూడా చూసుకోనక్కరలేదు. కాని, నిన్నసాయంత్రం వాడి కళ్ళలో విషం—

నల్లటి పచ్చటి ఎరవ్రత గీరల విషం !

వూపిరి బిగబట్టి అక్కణ్ణుంచి లేచొచ్చేసేన్నేను. అప్ప

ట్నుంచి దాదాపు ఏడుగంటలసేపు వూరంతా చెడదిరిగేను. వున్నా దిన్నై పోయేను ఎక్కడో పడిపోతాననిపించింది. అతిప్రయత్నంమీద నిలదొక్కుకుంటూ గదికొచ్చి పడ్డాను.

గదంతా చిమ్మచీకటి లైటు వెయ్యబోయి ఆగేను. నిదానించి చూసేను. కళ్ళు చిట్లించి చూసేను చీకట్లో ఏదో కదిలింది. నిశ్చలంగా చూసేను ! నాగుండె దడదడలాడింది ! ఏమిటది ?— అది — ఆకారం — వొక ఆకారం !
వాడి ఆకారం !

ఆలోచనకి అవకాశం లేకుండా, వాడినుంచి పలకరింపుకి కూడా వీలులేకుండా వొక్కవుదుటన వాడిమీదికి దూకేను. చీకట్లో మెత్తగా ఆడపిలలా వున్నాడువాడు అందమైన, ఎర్రనైన— బక్కపల్చని వాడిశరీరం — చీకట్లో దొరికింది నాచేతికి — వాడి కళ్ళు — కళ్ళలో విషం నిండినకళ్ళు — నాకేసి చూస్తున్నాయి — గొంతు దొరకబుచ్చుకున్నాను పీకనొక్కిపట్టేసేను ఇంకా నొక్కేస్తున్నాను గింజుకుంటున్నాడు వాడు వూపిరికై కొట్టుకుంటున్నాడు చీకటో వాడికళ్ళు పచ్చకళ్ళు, విషంకళ్ళు, కుళ్ళు దీనంగా భయంకరంగా విచిత్రంగా దారుణంగా చూస్తున్నాయి నావేపు — పిల్లి కళ్ళు — గొర్రెకళ్ళు — గాడిదకళు — విషం కళ్ళు—

శక్తినంతా వుపయోగించి వాడి ఆ అందమైన పీకని నొక్కేను వూహుం — నాశక్తి చాలడంలేదు ... కుడిచేతి పిడికిలి బిగించి ఆఖరుప్రయత్నంగా తీవ్రంగా వాడిగుండెల్లో కుమ్మేను —

అంతే !

జావలాగా శబ్దంలేకుండా — చీకట్లో నీడలాగా నేలమీదికి జారిపడిపోయేడు వాడు.

చీకటి చీకటి చిమ్మచీకటి.

నా గుండెలు నా గొంతులో నా చెవుల్లో కొంటుకుంటున్నాయి...

వొక్కసారిగా బెండులా తేలికైపోయేన్నేను. కళ్ళు తిరిగేయి. రెప్పవిప్పకుండా కళ్ళు మూసుకుని పక్కమీద పడిపోయేను.

బాగా తెల్లారేక, నాగది తలుపెవరో దబదబమని బాదేస్తుంటే మెళకువొచ్చింది —

ఇద్దరు మిత్రులు ...వొగురుస్తూ చెప్పేరు —

"—మన ఫ్రెండు ... రాత్రి హఠాత్తుగా చచ్చిపోయేట — గుండెపోటు అంటున్నారు డాక్టర్లు ...అదైనా ఎలావొచ్చిందో అర్థం కావడంలేదు—"

వాళ్ళు చెప్తున్నది వాడి మరణం గురించి.
తెల్లబోతూ నాగది నేలమీదకి చూసేను.
ఏమీలేదు ! గదినేలమీద ఏమీలేదు !!
మరిరాత్రి — నేను చంపిన ఆకారం ?—

* * *

చిత్తుగా తాగేసి తూలుతూ బార్‌నుంచి వొస్తున్నాను.

"పాపం ! చూసేవా ! ఫ్రెండ్ చచ్చిపోయిన బాధ భరించలేక తాగుతున్నాడు—" నన్నెరిగిన ఇద్దరో వొకడింకడితో అన్నాడు.

"ఫూల్స్ ! ఫూల్స్ !— అందరూఫూలే ! వాడు చచ్చిపోలేదు ! చచ్చిపోలేదు ! వాడోఫూల్ ! బ్యూటిఫుల్‌స్టుపిడ్ ! వాణ్ణి నేనే చంపేసేను ! నేనే చంపేసేను ! గుండెల్లో ఈ పిడికిలితోనే పొడిచి చంపేసేను ! చచ్చిపోలేదు,వాడు ! నేనే... చంపేసేను!..."

తాగేసి వున్నాను. ఈ మాటలే అన్నానో, ఈ మాటలే అంటున్నాననుకుని వేరేమాటలే అన్నానో గుర్తులేదు.

"పాపం !... మతిచెడింది..." అనుకుంటూ వాళ్ళు వెళ్ళిపోయేరు.

నేను మాత్రం నవ్వుతూనే వున్నాను.
నవ్వుకుంటూ నే వున్నాను ... ...
వికటంగా ... వికటంగా ... ...

# కీ॥ శే॥ నూతలపాటి గంగాధరం

శ్రీ జానమద్ది హనుమచ్ఛాస్త్రి

మంచిని పెంపొందించాలని
మానవతను పోషించాలని
అలుముకొన్న చీకట్లను
సాంతం అంతం చేయాలని

లోకమంతా వెలుగులతో
నాకంగా మార్చాలని
మనుగడ సాగించినట్టి
మధుర భావమూర్తి యతడు

పానచుట్టూ మిన్నాగులు
పొంచి తిరుగుతున్నాయని
కన్నువేసి జాగ్రత్తగ
మసలుకొంటు నడవాలని

కేకవేస్తు కవిత చెప్పి
హెచ్చరికలు చేసుకుంటూ
ఉరకలు వేస్తున్నవాడు
కనపడడే ! నేడు గంగాధరకవి

మనముందుండిన మిత్రుడు
మనలోనె కలిసిపోయె.

———:o:———

# కవితామృత జలధరం గంగాధరం

## శ్రీ మధురాంతకం రాజారాం

''ఏ పంచాంగమూ ప్రకటించలేదు
ఈ దినం ఆకాశాన్ని ఇన్ని మేఘాలు కప్పేస్తాయని!
ఏ శాస్త్రవేత్తా చెప్పలేదు
ఈ రోజు అందరి మనసుల్లో
ఇంత చీకటి వ్యాపిస్తుందని!...''

శ్రీ నూతలపాటి గంగాధరం కవిత 'ఆ వలి గట్టు' యిలా ప్రారంభమవుతుంది. సమాజ జీవనానికి మధ్యగా పెద్ద అగడ్త. ఈవలి గట్టున అనుభవాల పూరిగుడిసెలు. ఆవలిగట్టున ఆదర్శాల అద్దాల మేడలు. ఈ అగడ్త పూడేదెవ్వడు?- అన్నది కవికి ఎదురైన ప్రశ్న. తన ముప్పైఅయిదేళ్ల జీవితం పొడుగునా ఈ ప్రశ్నకు సమాధానం అన్వేషిస్తూనే వున్నాడు గంగాధరం. ఇంతలో జీవన ప్రవాహానికి అవతలిగట్టునుంచీ అతనికి పిలుపు రావడం తెలుగు సాహితీ ప్రపంచానికి వాటిల్లిన దురదృష్టం.

వేదారణ్యంగా పురాణ ప్రసిద్ధిగన్న ప్రాంతంలో, సోమకాసురుణ్ణి త్రుంచి ప్రామినుకులను ఉద్ధరించిన వేదనారాయణస్వామి వెలసిన నాగలాపురానికి అనతిదూరంలో, అరుణానదిగట్టునవున్న చిన్న గ్రామం రామగిరి. కొన్ని దశాబ్దాలకు పూర్వం ఇదంతా తొండలు గుడ్లు పెట్టుకునే ఊసర క్షేత్రంగా వుండేదట! అరుణియార్ ప్రాజెక్టు నిర్మించబడినతర్వాత అది బంగారంపండే సుక్షేత్రంగా మారిపోయింది. ప్రాజెక్టు నీటి పరీవాహ ప్రాంతంలో, పైరుపచ్చల నడుమ రమణీయమైన పూరు రామగిరి. కానీ అ రామగిరి 'కవితా రామగిరిగ మారుదోచు'' అంటూ సమకాలీన సాహితీపరుల గుర్తింపుకు పాత్రం గావడం మట్టుకు మిత్రుడు శ్రీ నూతలపాటి గంగాధరం వల్లనే!

రామగిరికి తూర్పుదిక్కున ఓ పెద్ద కొండ వుంది. కొండ పాద పీఠాన, చెట్ల గుబుర్ల నడుమ, జనుల పరామర్శకంతగా నోచుకోని వాలేశ్వరుడి దేవాలయంవుంది. వానాకాలపు రోజుల్లో మేఘాలు కొన్ని క్రిందికి దిగివచ్చి కొండకొమ్ము చుట్టూరా మూగడం కద్దు! ఆ చిత్రమైన దృశ్యం కనిపించినప్పుడు 'కాలువ తీయడానికి ముసుగు తలగుడ్డ చుట్టుకుని పార చేతికందుకున్న పాలేరు మొనగాడిలా వుంది గదూ!'' అనేవాడు గంగాధరం.

వృత్తిచేత ఉపాధ్యాయుడు, వ్యాపకంచేత కవి అయినప్పటికి పుటుకతో రైతుబిడ్డ గంగాధరం. 'వాణి నా రాణి' అనుకున్న పిన వీరభద్రుడిలా ఈ కవి పృథ్విని తన ప్రేయసిగా సంభావించాడు. 'పృథ్వి నా ప్రేయసి. మలయమారుతం ఆవిడ దూతిక. వేసవి నాలోని వలపు కాక. చెమట తీసి, చెమట ముత్యాలహారంవేసి, అంబరమంత విశాలంగా, అర్ణవమంత అగాధంగా నేను పృథ్విని ప్రేమిస్తున్నాను. మొయిలు గొడుగు నీడక్రింద, నిరాచ్ఛాదితమైన నా ప్రేయసి నిర్మలిన పులిన స్థలాలపై విశ్రమించి, నాభి దేశంమీద పిచ్చుక గూళ్ళు నిర్మించి, మధువులో ముంచిన మంచుముక్కల్లాంటి ఆమె తియ్యని పెదిమల్ని ముద్దుపెట్టుకుని, నాలోని వేసవి తాపభారాన్నంతా మెల్లిగా ఆమెలో జారవిడిచి, మత్తుగా నిద్రలోకి జారిపోతాను'' అంటాడు ఈ పృథ్వీ ప్రేమికుడు.

అయితే ఆ మత్తు వీడని మత్తుగా, ఆ నిద్ర దీర్ఘ నిద్రగా, తాను పుడమి తల్లి ఒడిలో ఒరిగిపోయే ఘటనమ గురించి ఈ కవి కలగని వుంటాడా – అనిపిస్తుంది. ఈ అనుమానానికి తావిచ్చేది 'కాలం' అనే కవితాఖండికలోని ఈ క్రింది రెండు గీతలు :

''మత్తుగా మనసులను పెనవేసిన కాలం
మధ్యలో సర్పమై కాటు వేస్తుంది ! :

## 2

వైయాకరణ కేసరి శ్రీ [illegible] సుబ్రహ్మణ్య శర్మగారంతటి

పండితునికి ప్రియ శిష్యుడై, తిరుపతి ప్రాచ్య కళాశాలలో సాహిత్యా ధ్యయనం గావించిన గురుకులశిష్యుడు గంగాధరం. ఏ గూటి చిలుక ఆ పలుకే పలుకుతున్నట్టుగా తొలినాళ్లలో ప్రాచీన సాహిత్య సాంప్రదాయ మార్గాల్లో నడిచినవాడు. అతడి అలనాటి ఛందోబద్ధ కవితకు మచ్చుతునక :

'లేవు లతా నికుంజములు
లేవు పిసాల కిసాల పుంజముల్,
లేవు మరంద మంజరులు
లేవు కడింది మిళింద బృందముల్
నీవిట లేని కాలమున!—
స్నిగ్ధ వసంత పరిమళాల
బృందావనమై హసించు చెలి ప్రాబరదు
కించుక నీవు కల్గినన్'

(ఆశాసుందరి)

ఏ మార్గంలో నడిచినా ఆలోచించడానికి అతడు చేసిన సాధన అప్పటి రచనల్లోనే కానవస్తుంది. — "కాళిదాసు శాకుంతల నాటకము నందలి అనసూయా ప్రియంవదలు నాయికయొక్క చెలికత్తెలు. అనసూయ యందు అనుభవమున్నది. ప్రియంవదలో ఆలోచన యున్నది. అట్లే నైషధము నందలి హంసలో అనుభవమున్నది. సూరన్న హంసలో ఆలోచనయున్నది. పై రెండు పాతలు ఏకహస్త విర్మితములు. ఈ మరాళద్వయము భిన్నహస్త పోషితము". (హంస ద్వైత్యము— భిన్నహస్త కౌశలము. భారతి, మార్చి 65) వ్యాసరచన గ్రాంథిక భాషలో వుండడం యిక్కడ గమనించవలసిన విషయం.

ఆలోచించినకొద్దీ గంగాధరంలో క్రొత్తదనం కోసం అన్వేషణ ననలు సాచి, మొగ్గలు తొడిగి, అతడి సాహిత్యారామంలో వచన కవితా కుసుమాలు వికసించి పరిమళించాయి. 'అమ్మమ్మ కట్టుకున్న ముతకచీర—అబ్బే, అదేం అందగిస్తుంది నీకు?' అని కవితా కన్యమందలిస్తాడతను. 'అమ్మమ్మ నడిచిందని నువ్వూ అలాగే నడిస్తే ఎలా? ఆమెకూ నీకూ మధ్య కాలం చాలా దూరం గెంతింది. అవ్వలా అడుగెయ్యడం మాని అంచలా నడవడం నేర్చుకో' అంటాడు.

అయితే గంగాధరం సాహిత్యాభినివేశానికి సంబంధించిన పునాది రాళ్లన్నీ ప్రాచీనాంధ్ర సాహిత్యానికి సంబంధించినవే గావడం—అతడిలో సమ్యగ్దృష్టిని పాదుకొల్పడానికి ఉపకరించిందనే చెప్పాలి. అతడి వచన కవిత్వమనేది అమాంతం ఆకాశంనుంచే వూడిపడిందిగా భావించడు.

"నన్నయ సంస్కృతంలో గూడాలేని ఛందో నియమాలతో తెలుగు పద్యాన్ని మరింత జటిలం చేశాడని కొందరనవచ్చు గానీ, మొట్టమొదటిసారిగా గద్యం విలువను గ్రహించింది గూడా ఆయనే నంటే ఎవ్వరూ కాదనరనుకుంటాము. అందువల్లనే పద్యంతో సమానమైన విలువ గద్యానికి కూడా యిచ్చాడు, తన కావ్యంలో! ఒక రకంగా చెప్పాలంటే పద్యానికీ గద్యానికి దాంపత్యం చేకూర్చాడన్న మాట! ఆ దాంపత్య సంతానమే నేటి వచన పద్యం ... పద్యాన్నీ, గద్యాన్నీ నన్నయ చంపూ కావ్యంలో శారీరకంగా కలిపాడు. నేటి కవి ఆ రెంటినీ మానసికంగా ఒకటి చేశాడు — తన వచన కవితా రూపంలో. — "చీకటినుంచి' కావ్యానికి చివర అతడు చేసుకున్న నివేదనలోని ఈ మాటలు వచనకవితనతడొక ఉత్పాతంగా గాకుండా, సహజ పరిణామంగానే భావించాడన్న విషయాన్ని తెలియజేస్తున్నాయి..

ఆధునిక వచన కవితకు బీజాలను ఆదికవి నన్నయ భట్టారకుడిలో దర్శించడం మాత్రమే గాదు, తాను మార్క్సిస్టు అయి వుండి గూడా గంగాధరం భగవంతుడి ఉనికిలో విశ్వాసం నిలుపుకుంటాడు. 'పశ్చిమాంబుధి నిముడు అస్తమించిన వెంట, నింగిలో జాబిల్లి వెలుగు వాకలగాంచి నీవు కలవని ఎంతుమ" అంటాడు. అంతేగాదు, ఆ నమ్మకం వల్లనే 'నే వసుధ నివసింతు' నను కుంటాడు.

ఏ బాహ్య రూపాన్ని ధరించి వచ్చినప్పటికీ, కవితయొక్క పరమార్థాన్ని గురించి గంగాధరానికి ఓ కచ్చితమైన అభిప్రాయముంది.

'శిలలు కరుగవలయు'. కలలు పండవలయు
కలతలడగవలయు కవిత విన్న!'

(చిన్నిదీపాలు)

## 3

గంగాధరం వేదాంతికాడు. వాస్తవికవాది. జీవితంపట్ల అతనికి అనురక్తి మెండు. కాని ఎందుకో మృత్యువు, మృత్యుర్యా, మృతవదన గహ్వరంలాంటి శీర్షికలతోబాటుగా అతని కవితలో మృత్యువుని గురించిన ప్రసక్తి మరీ ఎక్కువగా చోటుచేసుకోవడమే విచిత్రం.

అయ్యో, మృత్యువు లేకపోయిందేనని ఏడుస్తారట దేవతలు!
మానవులు అయ్యో, చావు వచ్చేస్తుందేనని ఏడుస్తారట!
(ఆశాసుందరి)

మృత్యువనేదే లేకపోతే జీవితంలోని మాధుర్యాన్ని రుచి చూడలేడట మానవుడు. (విద్యుత్తు)

బ్రతుకనేది ఒక బంగారపు ముద్ద. అందులో కుదలోహాలు కలిసితే ఘోరం వాటిల్లిందన్నమాటే! నీ బంగారం ముదని పరీక్ష జేసే మృత్యుపావక కుండం ముందుంది. ముందు మృత్యువు ండబట్టే, మానవుడిలోని మానవత్వం యింకా ఏ కొద్దో గొప్పో ఊపిరి పీల్చుకోగలుగుతూ వుంది. (పరిరక్షణ)

ఆగమ కిరణం. జీవితహరణం. పరోపయనం. ఏది? మృత్యువు. దౌర్బల్య హృదయాలకది పళయం. సాధు జనులకు సుఖ నిలయం. జాతి మతాలకు అతీతం. 'భువన విదీర్ణ కిరణం, పునీత మహా' మరణం? (మృత్యువు)

"చక్రవర్తి అధికారాలూ, ఐశ్వర్యమూ,
మహాకవి స్వప్నాలు, భావాలూ,
సైంటిస్టు థాట్సూ, ఎక్స్‌పెరిమెంట్సూ
రోడు రోలర్ని ఒక్క వ్రేలిమీద నిలబెట్టగలిగిన
మహావస్తాదు విజయాలూ,
అన్నీ దీని గడపకవతల పడిగాపులు కాస్తూ
మొరుగుతున్నాయి కుక్కలై!
ఇదే–నువ్వూ నేనూ ఒకటయ్యే చోటు
ఇదే అన్యాయాలకు అక్రమాలకు మరో గేటు
ఇదే–ప్రతి జీవీవేషం మార్చుకునే తెరమాటు
ఇదే ఇదే శ్మశానవాటి
మృత్యుముఖ సద్మ కవాటి" (మృత్యుముఖ గహ్వరం)

అసలు మృత్యువునుగురించి గంగాధరంచేసిన ఊహ ఎంత లోతుకు వెళ్ళిందంటే–కవితా సృష్టికిగూడా మృత్యువే మూలకంద మైందంటాడు అతడు. పదాల సంకెళ్ళు వేయడంవల్ల భావ కురంగాలు రక్తం గక్కి నేలకూలుతున్నాయట! మౌన ముద్రలో, మనో వీధిని ఎగిరిపోతున్న రాజహంసను పదశరఘాతంతో గురిచూచి పడగొట్టి వేయడంవల నే వాల్మీకి ఆదికవి అయినాడట! ఒక కిరాతకుని ఘాతుకాన్ని తిలకించి, తిలకించలేక విలపించి విలపించలేక, అదే ఘాతుకాన్ని-కొద్ది తేడాతో తానూ చేశాడుగదా!' అంటూ ఆశ్చర్యపడతాడతను.

వాల్మీకి మాట ఏమిటోగానీ, గంగాధరం విషయంలో కాల పురుషుని చెడు చెయ్యటానికి ఈ క్రింది మాటలు వ్యాఖ్యాన ప్రాయంగా వుండడం గమనించక తప్పదు.

'కత్తి పుచ్చుకుని
కదళీ వృక్షాన్ని, ఇలా
ఖండించరాదని, తానే
ఖండించి చూపాడు' (నా ప్రశ్న)

## 4

పటుమని పది పన్నెండేళ్ళ సాహితీ వ్యాసంగంలో గంగాధరం సాధించిన సిద్ధి నిస్సందేహంగా గణనీయమైంది. శ్రీ ఆరుద్ర ఈ కవిని 'నూతన పాళీ గంగాధరం' అన్నారు. శ్రీ దాశరథి 'కవితా గంగాధరు' డన్నారు. కవిగా అతడి స్థానాన్ని సాహిత్య చరిత్రలే నిర్ణయిస్తాయి. ఒక మిత్రుణ్ణిగా నేను సాహిత్యంపట్ల, జీవితంపట్ల గంగాధరానికున్న అభిప్రాయాలు కొన్నింటిని క్రోడీకరించి తద్వారా అతడి వ్యక్తిత్వాన్ని అంచనా వేయడానికి మాత్రమే ప్రయత్నిస్తాను.

గంగాధరం 'అరసం' కార్యవర్గ సభ్యుడు. లక్ష్య సాధనకు అవలంభించే మార్గాలను గురించి వచ్చిన అభిప్రాయ విభేదాల దృష్ట్యా రచయితలు సంఘాలుగా విడిపోక తప్పదన్న వాస్తవాన్ని ఇతడు గుర్తిస్తాడు. అయినా సాహితీ వేత్తగా సంఘాలకు అతీతుడుగా నిలబడి 'దేశంలోని రచయితలంతా అటు విరసంలోనో, యిటు అరసం లోనో సభ్యులైపోయారు. వీరు వాదులాడుకోవడంలో పోటీపడకుండా సాహిత్య సృజనలో పోటీపడితే దేశానికెంతో మేలు చేసిన వారవుతారు.' అంటాడు ('దారి'–ఆనంద సంవత్సరాది సంచిక). ఈ మాటలు వ్యక్తిగా గంగాధరం యొక్క తటస్థ దృక్పథాన్ని దర్పణంలా పట్టి చూపుతున్నాయి

గంగాధరం మితభాషి సౌమ్య శీలి. పరుషంగా మాట్లాడడం అతని స్వభావానికి విరుద్ధం. కానీ సాహిత్యం దగ్గరికవచ్చేసరికి

# కలగూరగంప

## గంగాధరంగారు

గంగాధరంగారు ఎప్పుడయినా మా ఆఫీసు వయిపుకివస్తే, భారతిలో పనిచేసే వాళ్ళని పలకరించకుండా వెళ్ళేవారు కాదు. ఆయన్ని చూస్తే సాహిత్యం అంటే పెద్ద అభిమానం ఉన్న మనిషి అని వెంటనే అనిపించేదికాదు. ఆయన మాటలు కూడా అలాగే ఉండేవి ఎప్పుడోతప్ప తను అనుకునేది నోటితో చెప్పేవారుకారు గంగాధరంగారు. ఎక్కువగా కాగితంమీదే పెట్టేవారు. ఆయన వ్యాసాలు, పద్యాలు చదివినవాళ్ళకి, "ఈ మనిషిలో ఇంత లోతు ఆలోచన ఉందా?" అనిపిస్తుంది. ఆయన పాతకాలం పద్ధతులని తీసి పారెయ్యలేదు, కొత్తకాలం పద్ధతులని మాత్రమే గుర్తించినట్లు తోచదు. బడిలో పిల్లలకి చదువు నేర్పుతూ సాహిత్యాన్ని గురించి గాఢంగా ఆలోచిస్తూ ఉండేవారనిపిస్తుంది...

"మీది అరసమా, విరసమా?" అని ఒకసారి అడగ్గా— "అరసంవాళ్ళు ఉండమన్నారు సార్; ఉన్నాను—" అని ఆయన మామూలు ధోరణిలో నెమ్మదిగా చెప్పారు. ఈ సమాధానంతోపాటు మెరిసిన ఆయన తెల్లని నవ్వు ఎంతో సూచించింది—నూతలపాటి గంగాధరంగారు ఒక నెమ్మది మనిషి...

కొన్ని ప్రాంతలలో సాహిత్య సభలు, రచయితల సంఘాలు చాలా చురుకుగ పనిచేస్తూ ఉంటాయి. వాటి సంగతి తెలిసినప్పుడు అనిపిస్తుంది, "ఆంధ్రదేశంలో సాహిత్యానికి ఇంత గుర్తింపు ఉందా?" అని. గంగాధరంగారు రచయితలలో ఎంత పలుకుబడి కలవారో ఆయన అస్తమయం తర్వాత వచ్చిన ప్రకటనలే తెలుపుతాయి. ఒక విధంగా అవి ఆయన వ్యక్తిత్వాన్ని తెలుపలేక పోతున్నాయని అనవచ్చు—ఎందుకంటే గంగాధరంగారు ఆర్భాటం లేని నిర్మలమయిన వ్యక్తి. పెద్ద పొగడ్తలు ఎందుకనో ఆయనకి నవ్వు...

"మీఊరికి ఎన్నోసారు వచ్చాను. మీ రామగిరి పక్క కొండల లోకి వెడుతు ఉండేవాళ్ళము. ఆరోజులు పోయా యి..." అని ఆయన కనిపించినప్పుడల్లా అంటే, "రండిసార్ మళ్లీ" అని నిదానంగా ఆహ్వానించేవారు ఆయన.

నూతలపాటి గంగాధరం గారు పాముకరిచి చచ్చిపోయారు, అన్నవార్త "రామగిరి" పేరుతోబాటు పత్రికల్లో చూసినప్పుడు మనస్సంతా అయోమయం అయిపోయింది ... రామగిరి ప్రాంతం కొండలలాగే, అడవులలాగే ఆయనస్నేహం ఒక జ్ఞాపకంగా మాత్రమే మిగిలిపోయింది...

## బాలవ్యాకరణము—త్రిలింగ లక్షణశేషము

ఏప్రియల్ నెల భారతిలో బాలవ్యాకరణము — త్రిలింగ లక్షణశేషము — అను శీర్షికతో శ్రీ నాగళ్ళ గురుప్రసాదరావు గారొక వ్యాసము వ్రాసినారు. దానిని చదివినమీదట నాకు తోచిన విషయములు వ్రాయుచున్నాను. దీనిని తప్పక ప్రచురింతురని తలంచుచున్నాను.

ఏ కావ్యమునైనను విమర్శించునపుడు మనము పక్షపాతము చూపరాదు. స్వ-పరభేదము పాటింపరాదు. తలవలె సమానాను రాగములు చూపుచు మంచిని పెంచుచు చెడ్డను ఖండించుచు పోవలెను. అంతియేగాని రాగద్వేషములకు తావుండరాదు.

1. "తద్భవములందు నలఘురేఫము కలదు" ఇది సీతారామాచార్యులవారి సూత్రము. కాని చిన్నయసూరి "శకటరేఫము తద్భవములందు లేదు" అని చెప్పెను. కాని సూరికి నిఘంటువు రచించునాటికి ఆయన తద్భవములలో అలఘు రేఫము కనబడుచున్నదని యంగీకరించిన వాడయ్యెను." అని ప్రసాదరావుగారు వ్రా, కాఱయ-యాతన. ప్రాకృ. కారి అని సూరి నిఘంటువులో పదము నుదాహరించిరి. కాగా తద్భవములందు పెక్కు శబ్దములలో శకటరేఫము కనబడుచుండ తన వ్యాకరణమున సూరి వానిని సూత్రబద్ధము చేయకుండుటకు కారణమేమి? సూత్రమునకు వేస్తే ప్రయోజనముండవలెనను కొన్నను "క్రదుర నాగమాత" వేదపురో

వృకోదరుఁ “అని పలికినాఁడుకదా! పోగా ప్రసాదరావుగారు అభినవ నన్నయభట్టాచార్యుల మాటల నుటంకించినారు? వారు చెప్పినంత మాత్రమున మన మంగీకరింపవలయునా? వారు ప్రయోగ మొక్కటియైనను జూపినారా? పోనీ ప్రసాదరావుగారైనను జూపినారా? మహాకవి ప్రయోగము చూపక ‘నేను చెప్పితిని నీవు వినవలె’ ననుట తగునా?

2 కోటపేట వైకృతములు.

ప్రసాదరావుగారు సూరి నిఘంటువులోని పదము చూపి సూరి కోటను వైకృతముగా గ్రహించెను అది నిర్వివాదాంశము” అనిరి మరి పేట సంగతి? సూరి నిరనుస్వారముగా పేట నుదహరించినాఁడు దేశమని సూరి భావన? మరి ప్రసాదరావుగారు — “బహుజనపల్లి వారీ పదిందుక నిర్గిందుక భేదము నేలగుర్తింపరో తెలియదాయె” అని వ్రాసినారు ఇంతకు పై వాక్యమున కర్థమేమో తెలియదు.

3 నిజము జెప్ప దలచినచో నభిమానమునకుఁ దావుండరాదు సూరిపై నభిమానమున బహుజనపల్లి వారిని కించపఱచుట సమంజసముకాదు. “జవ్వనంబున యందునని . బహుజనపల్లివారు దంతములగు సమహత్తులకందు వర్ణకము పరంబగునపుడు వగాగమము కొన్ని యెడల కానంబడియెడి”నని చెప్పిరి. సూరి “సమాసంబున యందు” అని ప్రయోగించియే యున్నాఁడనియు నట్టి ప్రయోగములు సూరికి తెలియుననియు ప్రసాదరావుగారు వ్రాసినారు. అస్తు. మరి సూరి యేల యీ విషయము సూత్రింపలేదు?

4 కౌరవ సభలో లజ్జా

వారిధి దగ నుద్ధరింప నా ద్రౌపది నని ప్రసాదరావుగారు వారిధి వలననుండి యను నర్థము సూరికి తెలియుననియు నందు వలననే పై పద్యము నుదహరించిరనియు వ్రాసిరి. “కాని వావిళ్ళవారు 1953 సం॥లో ముద్రించిన జైమినీ భారతములో లజ్జా వారిధి దిగ నుద్ధరింపవా అని యున్నది. ఈ పాఠము ప్రకరణోచితము గాదు” అని ప్రసాదరావు గారనిరి. ఇది తొందరపాటుతో వ్రాసినారేమోయని నా తలంపు?

ఈ పద్యము ధర్మరాజు హయమేధమునకు గూర్చి విచారించుచు కృష్ణునితో విన్నవించుచున్నాడు.

“హా సరోజాక్ష గోత్రదుఃఖార్ణవమున
మునిగియున్నాఁడఁ జేయూర్చుకొనగలేక
నీ కృపాదృష్టి వేరోడగాకయున్న
వెడలఁబడు టెట్లు మఖము గావించుటెట్లు.

ఇందు దుఃఖార్ణవమున మునిగియున్నాఁడనని ధర్మరాజను చున్నాఁడు. అట్లే లజ్జయనెడి సముద్రమున దిగిన ద్రౌపది నుద్ధరించినాడవనుట యుక్తమేగదా! ఇచ్చట దిగియనగా కేవల మవతరణార్థముంగాక లజ్జావారిధిలోఁబడియనియు చెప్పికొనవచ్చునుగదా.

7. సీతారామాచార్యులుగారు “అనేక కర్తృక క్రియకు సమీపకర్త యొక్క లింగవచనంబులగు” నని సూత్రించిరి. వారిచ్చిన యుదాహరణముల చూపుచు నందు లింగనిర్దేశము చేయలేదనియు పలికిరి. తరువాత “భూవరుడు సుహృజ్జనంబుఁబరివారమ్ముఁజిత్తము లందు మెత్తురే” అను ప్రయోగము ఆచార్యులుగారు చెప్పిన లక్షణమునకు విరుద్ధముగా నున్నది. దీనినిబట్టి అనేక కర్తృక క్రియకు సమీప కర్తయొక్క లింగవచనంబులగు అని ఆచార్యులుగారు చెప్పిన లక్షణము నిత్యవిధి గాదనియు దానిలో మార్పులు వలయుననియు దోచుచున్నది”. అని వ్రాసిరి. ఆచార్యులుగారుచెప్పినది నిత్యవిధిగాదు అనగుని సూత్రముననున్నంత మాత్రమున నది నిత్యవిధియని భావింపరాదు. ఇట్టిదే చిన్నయసూరి చెప్పిన సూత్రము—“కర్మధారయంబునం దుత్తునకచ్చుపరంబగునపుడు టుగాగమంబగు.” దీని కుదాహరణములు—నిగ్గుటద్దము—సరసపుటలుక. ఇది నిత్య విధియనుకొందమా? అయినచో దుక్కిటెద్దు—ప్రక్కటెముక — పల్లెటూరు మున్నగు శబ్దముల టుగాగమం బెట్లువచ్చినది? సూరి కీశబ్దములు తెలియవనుకొందమా? వ్యాకరణవేత్తలు కొన్నింటికి మాత్రమే సూత్రములు నిబద్ధింపగలరు. అట్లే సీతారామాచార్యులవారివిగూడ నర్థముచేసి కొనుట మంచిది.

విమర్శకులు రెండువైపుల సాకల్యముగా ప్రవర్తింపవలెనే గాని యొకరిపై పక్షపాతము వహించుట భావ్యముగాదు. సూరికి తెలిసినప్పటికి కొన్నింటిని సూత్రబద్ధము కావింపలేదు. ఆ పని ఆచార్యులుగారు చేసినారు. ఒక్కొక్కరి ప్రణాళిక యట్టిది.

సంస్కృతమున పాణిని సూత్రములకు వార్తికములు వెలసెవి-వానికి మహా భాష్య మవతరించినది. మిగిలినవారిద్దరు పాణినెంతయో గౌరవించిరేగాని నిందింపలేదు. అట్టివనియే ఆచార్యులు

గారు చేసిరి అది త్రిలింగ లక్షణ శేషమని వారే చెప్పుకొన్నారు గదా! అంతియేగాని యిందులో నొకరు మిన్న యొకరు చిన్న యని పలుకుట పలుకుబడి కానేరదు.'' ''పరదోషేక్షణ దివ్య చక్షుష్కు'' లగుట మంచిదికాదు. గుణగ్రాహిత్వముగూడ మనకవసరము.

—శ్రీ పాతకోట రాధాకృష్ణమూర్తి

# భా షా వి శే షా లు

ప్రాచీన తమ ద్రావిడభాషలో లేదా మూల ద్రావిడ భాషలో ఉండే ''అల్, ఇల్, ''ఉల్'' ''ఎల్'' అనే నాలుగు శబ్దాలు ఆధారంగా తెలుగులో అనేక పదాలూ, ఏర్పడ్డాయి. ఈ వ్యాసంలో అలాంటి కొన్ని రూపాల్ని, నాకు తెలిసినంతవరకూ, పొందుపరచ టానికి ప్రయత్నించాను ఇందులో అర్థవంతమైన రూపాలను ''పదాలు'' అనీ అర్థవంతమైన రెండు రూపాలు కలిసి ఏర్పడిన సామాసిక రూపాలను ''పదబంధాలు'' లనీ వ్యవహరించాను. కొన్ని టికి గల ప్రాచుర్యాన్ని నిరూపించేందుకు ఆధునిక సినిమా పాటల ప్రయోగాల్ని ఉదహరించాను. ఇందుకు భాషాకోవిదులు అన్యథా భావింపరనే ఆశిస్తున్నాను.

I అల్ = అ, అక్కడ అని మౌలికార్థాలు.

దీని నుండే ఏర్పడ్డ పదాలూ, పదబంధాలూ—

(1) అల = అ. (అలనాడు = ఆనాడు)

ప్రయోగము:- అలనాటి జనకుని కొలువులో

—డా. సి. నారాయణరెడ్డి.

(2) అలా = అక్కడ.

ప్ర:— అలా పైకి పో. అలా చెయ్యి, ఇలా కాదు. అనే వాడుక లోని అలా, ఇలా-పదాలపైన చెప్పినవి కావు ఇవి ఆలాగు (ఆ విధముగా), ఈలాగు (ఈ విధముగా) అనే పదబంధాల వ్యవహార సంక్షిప్త రూపాలు.

3) అల్ల = అ, అక్కడ.

ప్ర:— ఆ — అల్లనేరేడు చెట్టుకాడ అమ్మలాలా

డా. సి. నారాయణరెడ్డి

ప్ర:— అక్కడ — అల్లల్లా వెడదాము.

(4) అవి:- పూర్వంలో ''అవి'' స్థలవాచిగా ఉండేది. అప్పుడు విభక్తి ప్రత్యయ పక్షలేదు కాలక్రమంలో అందు స్థలవాచిగా ఏర్పడ్డ తరువాత ''అవి'' సప్తమీ విభక్త్యర్థక ప్రత్యయంగా వాడబడింది. (అందు + అవి < అందలి) కానీ, ''అందు'' నే ప్రత్యయంగా భావించిన వ్యాసకర్తల రచనలో ''అలి'' అను ప్రయుక్తమైన అగమంగా పేర్కొనబడింది.

(5) అల్ > అన్ + త > అంత.

దంత్యానునాసిక సామ్యంవల్ల 'అల్' లోని 'ల' కారం 'న' కారంగా మారుతుంది ఈ మార్పు వాడుకలో ఉంది భాషా వికాసకర్త శ్రీ సోమయాజిగారు తమ గ్రంథంలో దీన్నినిరూపించారు కూడా.

ఉదా. లేదు > నేదు, మునుగు > ములుగు.

ఇతరత్రాకూడా ఈ మార్పు మనం గమనించవచ్చు.

ఉదా:— ప్రకృతి - లాంగలము నాగలి (వికృతి)

ఈ ఉచ్చారణ మార్పు సంగీత గాయకులో స్పష్టంగా కనిపిస్తుంది. ''ఘంటసాల'' పాడిన ఈ పాట చరణంలో ఈ మార్పు వినిపిస్తుంది చూడండి.

ఉ:— ఒక పల్లె నన్ను మన్నించి తనవాడని అంటున్నది.
(మల్నించి)

ఒక తల్లి మనసు నన్నింకా పగవాడని అంటున్నది.
(నల్నింకా)

కర్ణాటక సంగీత— వక్రతుండము — వక్రతుళ్ళం
(మూర న్య 'ణ'కారానికి మూర్ధన్య 'ళ'కారం వచ్చింది)

అన్ + త > అంత (ఆ పరిమాణమంత)

కొందరు 'అంత' అంటే ఎక్కువ అనీ, 'ఇంత' అంటే తక్కువ పరిమాణమనీ భ్రాంతి పడతారు అది సరికాదు. భోజనాల వడ్డింపు సమయంలోని మాటలు దీన్ని నిరూపిస్తాయి.

ప్ర:— 1. అంతెందుకూ! ఇంత చాలు. (పెద్దలు)
2. అంతేనా ? ఇంత కావాలి (పిన్నలు)

1. వాళ్ల పరిచయం అంతంత మాత్రమే [కొది పాటి]
2 ఇంతలు కన్నులుండ [పెద్ద పెద్ద అని వయ ధిని భావం]

[6] అంత + కు > అంతకు.

ప్ర:- అంతకంతకు ధరలు పెరిగిపోతున్నాయి.

[7] అంత + లు > అంతలు > అందలు

ప్ర:- అందలూ వచ్చేరా? [అంతమందీ వచ్చేరా?]
[అంతా వచ్చేరా?]

[8] అన్ + తు > అందు.

[9] అంత + తనుకన్ > అంత + దా(కన్) > అందాకన్ అందాక. [పదబంధం]

[10] అందు + చేత > అందుచేత > అంచేత [పదబంధాలు]

11] అందు + తో > అందుతో

[12] అందు + కొఱకు > అందుకొఱకు

[13] అందు + వల్ల > అందువల్ల

[14] అందు + లో > అందులో

[15] అందు + కు > అందుకు (For that)

[16] అందు + అన్ > అందు + వ + అన్ < అందు + వన్ > అందువన్ > అందునా [దానియందు కూడా]

[17] అందుల : ఇది నన్నయగారి ప్రయోగం. ఇందలి 'ల' అల్ > "అల" యొక్క అవశిష్టరూపమని కొందరి అభిప్రాయం.

ప్ర:- అరుగుమంబుజనాభ! [illegible] పడిన్—భారతం.

[18] అంతకంటే, [19] అంతలో [20] అంతవరకు [[illegible]] అంతమట్టుకు [పదబంధాలు]

II ఇల్ = ఈ, ఇక్కడ అని మౌలికార్థాలు. దీని నుంచి ఏర్పడ్డ పదాలూ, పదబంధాలూ—

1] ఇలా = ఇటు, ఇక్కడ

ప్ర:- ఇలారా.

2] ఇలు = ఇల్లు

3] ఇల్లు

4] ఇలి: ఇది స్వతంత్ర పదం కాదు. పదబంధాలలో మాత్రమే కనిపిస్తుంది.

ఉదా: వాకిలి ⊃ వాకు + ఇలి
[పదబంధము] [ముఖగృహము]

వా, వాయి అనగా నోరు అని అర్థం. వా+కు> వాకు. ఈ నిర్వింధుకమైన "వాకు" అను పదంనుండే వాగు [మాటాడుట] అనే క్రియ ఏర్పడింది.

5] మున్+కు+ఇలి> ముంగు+ఇలి> ముంగిలి [పదబంధం] [ప్రాంగణం]

6] లోన్+కు+ఇలి> లోఁగు+ఇలి> లోఁగిలి [అంతర్గృహం] [పదబంధం]

7] ఇల్> ఇన్+త> ఇంత

8] ఇంత+కు> ఇంతకు 9] ఇంత+లు> ఇంతలు> ఇందలు

[10] ఇంత+తనుకన్> ఇందాకన్> ఇందాక [పదబంధం]

పదబంధాలు : 11] ఇంత కంటే 12] ఇంతలో 13] ఇంతవరకు 14] ఇంతమట్టుకు

15] ఇల్> ఇన్+తు> ఇందు

పదబంధాలు: 16] ఇందు+చేత> ఇందుచేత

17] ఇందు+తో> ఇందుతో

18] ఇందు+కొఱకు> ఇందుకొఱకు

19] ఇందు+వల్ల> ఇందువల్ల

20] ఇందు + లో =ఇందులో.

21] ఇందు+అన్> ఇందు+వ+అన్> ఇందువన్> ఇందునా = ఇందులో కూడా.

22] ఇందు+కు> ఇందుకు

23] ఇందుల: నన్నయగారి ప్రయోగము వివరణపైన చెప్పినట్లే.

III ఉల్ = "లోపల" అని మౌలికార్థం: దీన్నుంచి ఏర్పడ్డ పదాలూ, పదబంధాలూ—

1[ ఉల్లము = అంతరంగము [లోపలనుండు అవయవం]

2] ఉల్ > [illegible] > [illegible]లము = [illegible]

ప్ర. ఓలమాసపడక — భారతము.

3] ఉల్ > ఓల్ > లో

4] లో + కువ > లోకువ.

['కువ' అనునది ప్రత్యయం. మెలకువ, పెవకువ]

[5] లో + కడ > లోగడ (ఇదివరలో)

[6] లో + గుట్టు > లోగుట్టు (రహస్యము)

[7] లో + చు > లోచు > లొచ్చు (తక్కువ)

[8] లో + టు > లోటు (కొరత)

[9] లో + తు > లోతు (లోపలిభాగపు కొలత)

[10] లో + అన్ > లోన్ (షష్ఠీ విభక్తి ప్రత్యయం)

[11] లోన్ + ఉ > లోను = మొదలగు

ప్ర:-ఉత్తర లోనుగాగల పయోజముఖులు - భారతము

[12] లోను + అగు = లోనగు (క్రియ) = లొంగియుండు

ప్ర:-కానుకు లోనై తల్లి తండ్రి - పూర్ణమ్మ గురజాడ

[13] లోను + అన్ > లోనన్

[14] లోన్ + కు > లోగు

[15] లోన్ + కు > లోంగు > లొంగు

[16] లొంగు + పాటు > లొంగుబాటు (విధేయత)

[17] లోగు + అన్ > లోగన్ (లోగా (వాడుకరూపం)

[18] లో + వు > లోవు

[19] లో + పల > లోపల ('లోన' [illegible])

[20] లో + య > లోయ

ప్ర:-కొండలోయ

IV ఎల్ = ఏ, ఎక్కడ అని [illegible] పదాలూ, పదబంధాలూ,

[1] ఎలా = ఎక్కడ

ప్ర:-ఎలా వెళ్ళాలి—[illegible] అర్థం (ఏ విధంగా అని కాదు)

[2] ఎల్ > ఎన్ + త > ఎంత

[3] ఎంత + కు > ఎంతకు

[4] ఎంత + అ > ఎంతఅ > ఎంతలు

[5] పదబంధాలు :—(5) ఎంతలో (6) ఎంత వరకు (7) ఎంతమట్టుకు

[6] ఎన్ + దు > ఎందు

[7] ఎందు + కు > ఎందుకు

పదబంధాలు:—(8) ఎందు + చేత > ఎందుచేత > ఎంచేత

(9) ఎందు + కోసము > ఎందుకోసము

(10) ఎందు + కొఱకు > ఎందుకొఱకు

(11) ఎందు + వల్ల > ఎందువల్ల

(12) ఎందు + లో > ఎందులో

ఈ విధంగా తెలుగుతో 'అల్' 'ఇల్' 'ఉల్' 'ఎల్' అనే నాలుగు శబ్దాలనుంచీ సుమారు 70 పదాలు, పదబంధాలూ ఏర్పడ్డాయి. వీటన్నిటిలోనూ మౌలికార్థం సహజంగానో గర్భితంగానో ప్రకటమవుతూనే ఉంది. —శ్రీ మామిడన్న

## "శాతవాహన జన్మ పత్రిక"
## 'అనక్రానిజమ్ కాదు'

1974 ఏప్రిల్ నెల భారతిలో కవిశ్రీ వజ్ఝల కాళిదాసు గారి 'శాతవాహన సంభవము' అనే రసవత్తర కావ్యాన్ని సమీక్షిస్తూ ఎవరో విమర్శకుడు తన అజ్ఞానాన్ని వెల్లడించుకున్నాడు.

"మన పురాణాలలో రాముని జననం పునర్వసు నవమి అనీ, కృష్ణునిది రోహిణి అష్టమి అని మాత్రమే చెప్పబడి ఉన్నవి" అంటారు విమర్శక శిరోమణి. అంతే కాకుండా మహాకవి కాళిదాసు గారిని ఇలాగ విమర్శించేరు— "శాతవాహనుని జన్మపత్రికను వ్రాసి ఒక కాల వ్యతిరిక్తాలంకారమును (అనక్రానిజమ్) చేపట్టి కవిగారు తమజ్యోతిషశాస్త్రాభిరుచిని వెల్లడించినారు".

పై రెండు వాక్యాలబట్టి విమర్శకుడు తనకి పురాణాలన్నీ క్షుణ్ణంగా తెలిసినట్లు, జ్యోతిషశాస్త్రం కూడా బాగా తెలిసినట్లు లోకానికి చాటుకోవాలని ప్రయత్నించినట్లు స్పష్టంగా తెలుస్తూంది. కాని విమర్శకుడు రామాయణంకూడా చదవలేదు. రామాయణం

చదవని విమర్శకుడు "పురాణాలు" చదివినట్లు ప్రగల్భంగా రాసుకోవడం వారి సంకుచిత తత్వాన్ని నిరూపిస్తుంది.

శ్రీమద్వాల్మీకి రామాయణంలో, బాలకాండ అష్టాదశ సర్గలో ఎనిమిది తొమ్మిది, పది శ్లోకాలు క్రింద పొందుపరుస్తున్నాను.—

8. శ్లో : తతోయజ్ఞే సమాప్తేతు ఋతునాం షట్సమాత్యయుః
తతశ్చ ద్వాదశే మాసే చైత్రే నావమికే తిథౌ

9. శ్లో : నక్షత్రేఽ దితిదైవత్యే స్వోచ్చ సంస్థేషు పంచసు
గ్రహేషు కర్కటే లగ్నే వాక్పతా విందునా సహ

10. శ్లో : ప్రోద్యమానే జగన్నాథం సర్వలోక నమస్కృతమ్
కౌసల్యా జనయద్రామం సర్వలక్షణ సంయుతమ్

పోనీ విమర్శకుడు సంస్కృతం చదువుకో లేదనుకుందాం.

తెలుగులో భాస్కర రామాయణం బాలకాండలో శ్రీరాముల జననం గూర్చి చెప్పిన భాగంలో ఇలా ఉంది.

"వెలయ: బంద్రెడవ నెలయందుఁ జైత్రపు
నర్వను బుధశుద్ధ నవమినాడు
పంచగ్రహంబులు పరగ నుచ్చస్థాన
గతులుగా గురుసుధాకరులు గూడ
కర్కాట కాఖ్యలగ్నమునందుఁ గౌసల్య
హరికర్థమగు రాము నకుర గనియె"

శ్రీరాముని కాలానికే అంటే వాల్మీకినాటికే మన దేశంలో తిథి, వార, నక్షత్ర, లగ్నాలు గూర్చిన్నీ గ్రహాల ఉచ్చ నీచలగూర్చిన్నీ— అనగా సమగ్రమైన జోతిషశాస్త్రం గూర్చి—విపులంగా తెలుసునని అర్థమవుతుంది.

కాని ఈ విమర్శకుడుగారు—"తిథులు ఈ రాసులు. లగ్నాలు వారాలు గ్రీసునుండి వరాహమిహిరుడు (యవనాచార్యుడు క్రీ. శ. 7–8 శతాబ్దం) సంస్కృతీకరించి మనకు దించినాడు." అంటారు:

కాని రామాయణ కాలానికే మన కివన్నీ తెలుసును.

శాతవాహనుడు రాముని కంటు పుట్టలేదు. కాబట్టి కవిశ్రీ కాళిదాసుగారు వ్రాసినదేమీ "అనక్రానిజమ్" కాదు.

విమర్శకుడు తన ప్రశ్నార్థాన్ని గ్రహించటం తప్పేమీకాదు.

అంతేకాకుండా ఈ విమర్శకుడిగారికి శ్రీ కాళిదాసుగారిమీద ఏదో "గుర్రు" ఉంది కాబోలు. అది ఈ విమర్శలో విగూఢంగా వెళ్లగక్కుకున్నారు.

కాకపోతే "శాతవాహన సంభవం" లాంటి మహాకావ్యానికి ఏవో లేనిపోని లోసుగులున్నట్లు (పరోక్షంగా- indirect గా) వ్రాయ వలసిన అవసరం ఏముంది.

అవికూడా సూచిస్తాను —

"మునికన్య వనలక్ష్మి శాతుల ప్రణయోదంతం శాకుంతలోపాఖ్యానం కరువున బోసినట్లున్నది." అంటారీ విమర్శకుడు. శకుంతలోపాఖ్యానం వీరు మరోమారు చదువుకుంటే బాగుంటుంది.

మరోచోట "కవిగారు ఉపయోగించిన కవితా సామగ్రి అంతా సమయాసమయాలు పాటించకుండా పోతన దగ్గిర చేబదులు తెచ్చుకున్నవే" అని విమర్శ కోవాత.

సరెుం, పదాలన్నీ శబ్దరత్నాకరంనుంచి దొంగిలించినవి అనలేదు.

కవిత్వానికి "సామగ్రి" ఏమిటి ?

ఈ విమర్శకుడు గారు పురాణాలలో ముఖ్యమైన రామాయణ భారత భాగవతాలు (ఏ ఒకటికూడా) చదవకుండానే చదూకున్నట్లు చాటుకోడానికి ప్రయత్నించి విఫలుడయేరు.

ఈ పరామర్శ ముగిస్తూ నాలుగు ముక్కలు వ్రాయక తప్పదు.

ఈమధ్య వెలువడిన తెలుగు కావ్యాల్లో కవిశ్రీ శ్రీకాళిదాసు గారి "శాతవాహన సంభవం" ఉత్తమ శ్రేణికి చెందినది. ఇందులో ఎన్నో సరిక్రొత్త పోకడలున్నవి. ఇది మహాకావ్యం. తెలుగువారు గర్వ పడవలసిన రచన. దీనిని గురించి విపులంగా మరోసారి వ్రాస్తాను.

—శ్రీ యం. వి శాస్త్రి.

---

# గ్రంథ విమర్శలు

## శ్రీ రామాయణ కావ్యతిలకమ్

(సంస్కృత కావ్యము. మధురవాణీ రచితము. సంపాదకులు డాక్టర్ బి. రామరాజుగారు. డెమ్మీసైజు 26+192 పుటలు. వెల రూ. 6లు. ప్రకాశకులు — ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, హైదరాబాదు).

సంగీత సాహిత్యాలలోను, సమరాంగణంలోను సాటిలేని రీతిని విహరించి విశ్వవిఖ్యాతిని గడించిన విజయనగర సార్వభౌముడు శ్రీకృష్ణదేవరాయలవలెనే ఆ సామ్రాజ్యపు సామంతులలో ముఖ్యుడైన రఘునాథనాయకుడు అన్నివిధాలా రాయలకు దీటైనవాడు. ఆయన సంస్కృతాంధ్రాలలోని వివిధ శాఖలలో ఎన్నో గ్రంథాలు రచించాడు. ఆయన రచించిన రామాయణం తెలుగు ప్రబంధాలలో ప్రఖ్యాతమైనది. దానికి ఈ గ్రంథం సంస్కృతీకరణం.

ఒకనాడు ఆయన సభాభవనమైన ఇందిరా మందిరంలో ఒక గాయకురాలతని రామాయణాన్ని శ్రావ్యంగా గానంచేసి, ప్రభువునూ, సభ్యులనూ రంజింపజెయ్యగా, అది సంస్కృతంలో కూడా ఉంటే బాగుండునని రఘునాథ నాయకునికి తోచింది. దాన్ని సంస్కృతీకరించడానికి ఎవ్వరు అర్హులా అని ఆలోచిస్తూ నిద్రించిన అతనికి స్వప్నంలో శ్రీరామచంద్రుడు ప్రత్యక్షమై మధురవాణియే దానికి తగినదని తెలుపగా, రాజాజ్ఞ ననుసరించి అతని ఆస్థాన విద్వాంసురాలైన మధురవాణి మధురాతి మధురంగా దానిని సంస్కృతం లోనికి తర్జుమాచేసింది. రచన ఎంత మధురంగా, సరళంగా ఉన్నదీ గ్రహించడానికి ఈ క్రింది శ్లోకం ఒక్కటే చాలును.

పుత్రులు లేని దశరథుడు పుత్రేచ్ఛను తెలిపే సందర్భంలో

'కుటిలాసిత కుంతలాభిరామం
నిటలాలంబి లలంతికాలలామమ్।
ఉదయద్రదనం కదా ను సూనోః
ముఖ మీక్షే ముహురుజ్జిహానహాసమ్.
[సర్గ 3 శ్లోకం 20]

పైని శ్లోకం ఎంతో రమణీయమై పఠితను మిక్కిలి ఆకర్షిస్తున్నది గదా!

ఉత్తమశ్రేణికి చెందిన యీ కావ్యం ఇదివరకు ముద్రితం కాలేదు. దీని వ్రాత ప్రతి కూడా ఒక్కటే! అదీ — తంజావూరు సరస్వతీమహల్ లైబ్రరీలో కాక మైసూరులోని ప్రాచ్య పరిశోధనాలయంలో మాత్రమే — అసమగ్రంగా లభించినది. శైథిల్యాలతోనూ, వ్రాత తప్పులతోను నిండి, అసమగ్రంగా ఉన్నా నామావశిష్టం కాకుండా ఉండడానికి ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారు దీని ప్రకటనకు పూనుకోవడం మిక్కిలి ముదావహం. దీని పరిష్కరణకు సమర్థ పరిశోధక విద్వాంసులు డాక్టర్ రామరాజుగారు పూనుకోవడం ఎంతో సముచితంగా ఉన్నది.

సంస్కృతాంధ్రాంగ్లాలలో గట్టి విద్వాంసులైన డాక్టర్ రామరాజుగారు శైథిల్యాలను పూరించి, తప్పులను సరిదిద్ది, ఛందో భంగాలను, వ్యాకరణ దోషాలను సవరించి వీలైనంత పరిశుద్ధంగా

దీనిని తయారుచేశారు. వ్రాత ప్రతిలోని పాఠాలను అధస్సూచికలలో చూపారు. వాటినిబట్టి వారు చేసిన పరిష్కరణ ఎట్టి ఉత్తమమో స్పష్టం కాగలదు.

ఉపలబ్ధమైన గ్రంథభాగం పధ్నాలుగు సర్గల పై చిలుకు ఉన్నది. ప్రథమసర్గ పీఠికారూపం. అందు రఘునాథనాయకుని వర్ణన, సభావర్ణన, తన రామాయణాన్ని సంస్కృతీకరించవలెనని ప్రభువు మధురవాణి కాజ్ఞ యిచ్చుట మున్నగునవి ఉన్నవి. రెండవ సర్గలో వాల్మీకి రామాయణాన్ని రచించుట, కుశలవులు గానం చేయుట, అయోధ్యాపుర వర్ణన, తృతీయసర్గలో దశరథుని యాగ ప్రయత్నం, చతుర్థ సర్గలో యజ్ఞ పురుషావిర్భావం, పాయస ప్రదానం, వాలి, సుగ్రీవాదుల జననం మున్నగునవి వర్ణించబడినవి. ఐదవ సర్గలో రామాదుల జననం మొదలు తాటకా సంహారంవరకూ కథ సాగినది. ఆరవ సర్గలో విశ్వామిత్ర యాగరక్షణ అహల్యా శాప విమోచనం ప్రధానాంశాలు. సప్తమ సర్గలో శివధనుర్భంగం, అష్టమ సర్గలో దశరథ పుత్రుల వివాహం, పరశురామ గర్వభంగం, నవమ సర్గలో అయోధ్యా ప్రవేశం ఉన్నవి. దశమ సర్గలో ఆయోధ్యా కాండ కథ సంగ్రహించబడినది. పదకొండవ సర్గలో శ్రీరాముని వనవాసం మొదలు వాలి సుగ్రీవుల వృత్తాంతం వరకూ ఉన్నది. ద్వాదశ, త్రయోదశ సర్గలలో కిష్కింధాకాండకథ, చతుర్దశ సర్గలో సుందరకాండ కథ ఉన్నది. పదునైదవ సర్గలో మొదట కొంత భాగం లోపించినది. లభించిన గ్రంథభాగంలో అంగదరాయబారం, కుంభకర్ణయుద్ధం కానవస్తున్నవి. అనుపలభ్యమైన గ్రంథం ఎంతో తెలియదు. డాక్టర్ రామరాజుగారు తమ ఆంగ్ల పీఠికలోనూ, తెలుగు పీఠికలోనూ మధురవాణి రచనా ప్రాశస్త్యాన్ని వివరించారు.

అక్కడక్కడ అచ్చు తప్పులు దొరలినా, ముద్రణ—దేవనాగరి లిపిలో చాలా అందంగా కూర్చబడింది.

ఇందలి మొదటి 8 సర్గల చివరను, 12 వ సర్గ చివరను 'శ్రీరామాయణ సార కావ్యతిలకే' అని ఉండడంవల్ల దీనికి ఆ పేరే పెట్టబడినట్లు తోస్తున్నది, కాని, మిగిలిన సర్గల చివర 'శ్రీరామాయణ సారసామని మహాకావ్యే' అని ఉన్నందున దీనిపేరు 'శ్రీరామాయణ సార' మని ఉండడమే సముచితంగా తోస్తున్నది. తిలకమనేది శ్రేష్ఠతను సూచిస్తుంది.

లభించినంత వరకయినా ఈ మహాకావ్యాన్ని ప్రకటించిన ఆం. ప్ర. సాహిత్య అకాడమికిని, పరిష్కర్తలు డాక్టర్ రామరాజు గారికి ఆంధ్రుల కృతజ్ఞతను చెప్పవలసి ఉన్నది.

—శ్రీ బులుసు వేంకట రమణయ్య.

Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd., by S. Radhakrishna at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada-3. Editor : S. Radhakrishna, Vijayawada. Phones : 75667 & 75226.